## నవయుగ కవిచక్రవర్తి, పద్మభూషణ్
## జాషువ రచనలు

## మొదటి సంపుటం

# గబ్బిలం

సివిల్ సర్వీసెస్, గ్రూప్ - I, II
మొదలగు పరీక్షలకు, సాహితీప్రియులకు
ఉపయోగపడే పుస్తకం.



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**Navayuga Kavichakravarthi, Padmabhushan - Jashuva Rachanalu - Vol. I – GABBILAM**

ప్రచురణ నెం. : 2350/19 R

ప్రతులు : 1000

గత ముద్రణలు : 1996, 1998, 1999

వి.పి.హెచ్. ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2004

వి.పి.హెచ్. ద్వితీయ ముద్రణ : డిశంబర్, 2004



**వెల: రూ.25-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



టైప్ సెట్టింగ్: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# దళిత చేతన కేతనం

ఆంధ్రదేశంలో ఏ రకమైన ఉద్యమాలూ ఉధృతరూపం ధరించని కాలంలో, "ఘనదురాచార సాకారమగ్నమై ప్రజాబాహుళ్య మొద్దున బడకముందటి" కాలంలో, పందొమ్మిదో శతాబ్దం చివరి దశకంలో జాషువా జన్మించాడు. జాతీయవాదం ఇచ్చిన ఉత్సాహం, అందులోని పాయగా ముందుకొచ్చిన సంస్కరణవాదం ఇచ్చిన స్ఫూర్తి - గాంధీజీ నాయకత్వాన రాబోయే కాలంలో దేశంలోని కులమత వివక్షత, ఆర్థిక అసమానతలు తొలగిపోగలవన్న నమ్మకాన్ని జాషువాలో కల్గించాయి. రాజకీయ భావాల్లో మితవాద దృక్పథం అనుసరించినా; కవితా తీవ్రవాద వీరావేశంతో అతివాద భావాలపట్ల ఆకర్షితుడయ్యాడు.

అగ్రవర్ణ దురహంకారాలను చవిచూసిన జాషువా సౌమ్య పదజాలంతోనే వాటిని ఎదిరించాడు. ఓ సందర్భంలో ఆయనే చెప్పినట్లు "నాకు గురువులు ఇద్దరు - పేదరికం, కులమత భేదం. ఒకటి సహనాన్ని నేర్పితే రెండవది నాలో ఎదిరించే శక్తిని పెంచింది..." అన్నది ఆయన కవిగా, వ్యక్తిగా వీరార్రూప ప్రదర్శనకు నేపథ్యాలు. 1925కు ముందటి జాషువా రచనలను ఆవిర్భవించబోయే మహాకవి జాషువాకు పూర్వరంగంగా భావించవచ్చు. భావకవిత్వ యుగంలో రాసినప్పటికీ విలక్షణా భావజాలంతో, వస్తు నిర్వహణా నైపుణ్యంతో దుష్ట సమాజం మీద ప్రళయనృత్యం చేశాడు. ఆగామి సమాజాన్ని సుందరంగా భావించి ఆహ్వానించాడు. భావకవిత, అవధాన కవితల్లో మునిగితేలాడు. నాటి సమకాలిక కవులందరిలాగానే రాష్ట్రాభిమానం, దేశాభిమానం కవితల నిండా ప్రోదిచేస్తూ అక్కడే ఆగక విశ్వనరుడుగా ఎదిగాడు.

ఆ కాలంలోనే ఆర్థికమాంద్యం ఒడుదుడుకులతో, రెండో ప్రపంచ యుద్ధ ప్రభావంతో అతలాకుతలమవుతున్న తన చుట్టూ ఉన్న సమాజాన్ని చూశాడు. కారణాలేవైనా తాపీ ధర్మారావుగారి ప్రోద్బలంతో యుద్ధ ప్రచారశాఖలో చేరారు. జస్టిసు పార్టీ అభిప్రాయాలను మన్నించారు.

సరిగ్గా ఇదే కాలంలో సోషలిజం గాలులు తెలుగునాట వీయడం ఆరంభించాయి. మేధావుల మెదళ్ళు పదునుదేరడం మొదలయ్యాయి.

సంఘటిత శ్రామికశక్తుల పోరాటాలూ, విజయాలూ, వైఫల్యాలూ, సరికొత్త ఆర్థిక సామాజికాంశాలకు ఊపిరులూదుతున్నాయి. పాత సామాజిక భావనల కుదుళ్ళు కదలబారడం ఆరంభమైనాయి. జాషువా కవిత్వం మీద వీటన్నిటి ప్రభావాన్నీ పసిగట్టగలం. సామాజికాంశాలతో ఆర్థికాంశాలను గూడా జోడించి చెప్పడం గుర్తించగలం. వీరి ఖండకావ్యాలన్నీ వీటికి దాఖలాలు.

ముఖ్యంగా 1943లో ఫిబ్రవరిలో ఆంధ్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన జరిగింది.

ధర్మారావు, జాషువా ఇద్దరూ యుద్ధ ప్రచారశాఖ నెల్లూరులో పనిచేస్తున్న కాలం అది. కనుక ఈ మహాసభల వివరాలూ అభ్యుదయ రచయితల ధ్యేయం - శ్రామికశక్తుల పక్షపాతం అన్న విషయం తాపీ ద్వారా జాషువా గ్రహించే ఉంటారు. ఇవన్నీ దృఢంగా నాటుకున్న జాషువా 1943 ఏప్రియల్‌లో రాసిన కాందిశీకుడన్న కావ్యంలో

*"కొడవటి టెక్కెమున్ తలను గూరిచి కార్మిక కర్షకాళితో*
*నడుము బిగించె నీయుగమునందొక నూతన సామ్యవాదమ*
*న్గడబిడ! దాని దెబ్బకు కకావికలైనది జర్మనీ*
*జడనిధి, నేటి మారుపు లసంఖ్యము లంచితముల్ విచిత్రముల్.*

అన్న స్పష్టమైన అభిప్రాయానికొచ్చాడు.

దీనికి ముందున్న సంప్రదాయ సాహిత్య స్థితి కాస్త గమనించాలి. 1934 నుండీ రాస్తున్న విశ్వనాథ వేయిపడగలు నవల ప్రథమ ముద్రణ 1939. అప్పట్లో ఆంధ్రపత్రిక ధారావాహికంగా ప్రచురించి ప్రచారం ఇచ్చింది. వేయి పడగల హైందవ నాగరాజును జాషువా మౌనంగా సహించలేదు. వర్ణ ధర్మాల ఉక్కుచట్రం అమలును ఆకాంక్షించే శక్తుల నెదిరించటం కర్తవ్యంగా భావించాడు. జాతీయోద్యమంలో భాగంగా ముందుకొచ్చిన సంస్కరణ ఉద్యమం ఇలాటి శక్తులవల్ల వెనకడుగును వేసే ప్రమాదం ముంచుకురాగలదని పసిగట్టే - జాషువా 1941లో గబ్బిలం వెలువర్చాడు. 20వ శతాబ్దంలో వచ్చిన ఆధునిక తెలుగు కావ్యాల్లో విశిష్టమైంది గబ్బిలం. ఖండకావ్య రచనలో సుమారు 22 సంవత్సరాలు పదునెక్కిన కలం సృష్టించిన అద్భుత ప్రతీకాత్మక కళాఖండం గబ్బిలం.

ఖండకావ్య ప్రక్రియకు, ఊపిరులూది జవం జీవంతో తొణికిసలాడేలా చేసి ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రతిష్ఠాకరమైన స్థానం సంపాదించి పెట్టినవాడు జాషువా.

సామాజిక అసమానతలపై ఏవగింపు, సంస్కరణల ఫలాలు చేతికి అందగలవన్న ఆశ రగుల్కొంటున్న తరుణంలో వర్ణాశ్రమ ధర్మాల పరిరక్షణను సమర్థించే లక్షణాలు ముందుకొస్తున్నవైనం జాషువాను కలవరపరచాయి. హక్కుల సాధనకు ఉద్యమించే తరుణం ఆసన్నమైందని భావించాడు. హరిజనులుగా పిలవబడుతున్న వారిలో చైతన్యం రగిల్చి ఉద్యమించేలా చేసి దళితుల్లో ఆత్మగౌరవ సాధనకై తపించాలని ఊహించాడు. పీడకవర్గాల ముక్కుగుద్ది హక్కుల సాధనా దిశగా సాగిన మహాప్రస్థానంలో జాషువా ఎత్తిన అనల పతాకం గబ్బిలం. ఆగామి యుగంలో దళిత సూర్యుడి శిరసు నుంచిన అగ్ని కిరీటం గబ్బిలం.

జాషువా కావ్యాలన్నీ 3 సంపుటాల్లో నేటి తరానికి అందుబాటులోకి తేవాలన్న విశాలాంధ్ర ప్రచురణాలయం సంకల్పానికి జాషువా ఫౌండేషన్‌వారూ, హేమలతా లవణంగారూ అంగీకరించి తోడ్పడినందుకు కృతజ్ఞులం. గతంలో జాషువా శతజయంతి నివాళిగా విశాలాంధ్ర ప్రచురణాలయం పలువురు ప్రముఖుల వ్యాసాలతో డా॥ యస్వీ సత్యనారాయణగారు సంకలనం చేసిన 'జాషువా సాహితీ ప్రస్థానం' (1995) ప్రచురించింది.

జాషువాగారే అన్నట్టు "సుకవి జీవించె ప్రజల నాలుకలయందు" అన్నది నిజమైనా - మా వంతు బాధ్యతా నిర్వహణలో భాగంగా ఈ మొదటి సంపుటిని పాఠకుల కందిస్తున్నాం. మిగిలిన సంపుటాలు త్వరలో రానున్నాయి.

సాహిత్యాభిమానులందరూ మా ప్రయత్నాన్ని హర్షిస్తూ ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

డా॥ ఏటుకూరి ప్రసాద్
సంపాదకుడు,
ఫిబ్రవరి, 2004. విశాలాంధ్ర ప్రచురణాలయం.

# జాషువ రచనలు
# మూడు సంపుటాల్లో...

| | |
|---|---|
| | రూ. |
| *1వ సంపుటం* | |
| గబ్బిలం | 25 |
| *2వ సంపుటం* | త్వరలో |
| స్వప్నకథ, పిరదౌసి, ముంతాజ్‌మహల్, కాందిశీకుడు, బాపూజీ, నేతాజి. | |
| *3వ సంపుటం* | త్వరలో |
| స్వయంవరం, కొత్తలోకం, క్రీస్తుచరిత్ర, ముసాఫరులు, నా కథ రెండు భాగాలు, నాగార్జునసాగర్. | |

ప్రతులకు: **విశాలాంధ్ర బుక్ హౌస్‌లు** మరియు
**ప్రముఖ పుస్తక విక్రేతలు.**

# విజ్ఞప్తి

*సహృదయులారా!*

కాళిదాసుని మేఘసందేశము మనస్సులో నుంచుకొని నే నీ కావ్యమును రచించితిని. గ్రంథనామము గబ్బిలము. శ్రోతల కిది కటువుగా దోచవచ్చును. కానీ అందలి కథానాయకుడు ప్రణయ సందేశము నంపును. ఇతడంపునది తుకతుకనుడుకు నశ్రుసందేశము. అతని శిక్షాకాలపరిమితి యొక సంవత్సరము. ఇతని శిక్ష ఆజన్మాంతము. తరతరములు. దీని కవధి లేదు. అతడు మన్మథాగ్నితప్తుడు, ఇతడు క్షుధాగ్ని పీడితుడు.

*'నాదు కన్నీటి కథ సమన్వయము సేయ*
*నార్ద్రహృదయంబు గూడ కొంతవసరంబు'*

అని యితడు వాపోవును. కులీనులగు రాజులకువలె హంసలు, చిలకలు మున్నగు నుత్తమ పక్షీదూతలితనికి జిక్కుట అసంభవము. కావున నిట్టిడుల జీర్ణకుటీరములలో నిరంతరము దర్శన మిచ్చు గబ్బిలము నితనికి సందేశహారిగా బరిగ్రహించితిని. రసజ్ఞుల కిందలి యౌచితి సులభగ్రాహ్యము. ఇంట బ్రవేశించి దీపమార్పిన గబ్బిలమును జూచి తన కన్నీటి కథ నీశ్వరునితో చెప్పుమని వీడు ప్రార్థించెగాని నిజమున కతని యుద్దేశ్యము దేశారాధన. కైలాస యానమునకు నాపన్నిన త్రోవ కొంత వక్రతకు గురియైనది. ఇది దోషము కాదనుకొందును. ఈ కృతి రసజ్ఞ లోకాదరణ నందిన నా శ్రమ ఫలోన్ముఖము కాగలదు.

నేనీ గ్రంథమును ముగించు నవసరమున గుంటూరు జిల్లా బోర్డు ప్రెసిడెంటుగారును, దేశభక్తులును, కళాభిమానులునగు శ్రీ కల్లూరి చంద్రమౌళి చౌదరిగారు మా యూరు దయచేసి గ్రంథము నామూలాగ్రముగా విని పతిత్వము వహించుట కంగీకరించుట నా యదృష్టము. వారికి నా నమస్కారములు. వారికి నేను కృతజ్ఞుడను.

## రెండవ భాగానికి తొలిపలుకు

గబ్బిలము కైలాసమునకు సందేశం తీసికొనిపోయి చిరకాలమైనది. మనపేదవాఁడెదరు తెన్నులు చూడసాగినాడు. వాని సందేశ ఫలితంగా

నాల్గుమూలల నుండి ప్రసన్న వాయువులు వీవసాగినవి. దేవాలయ ప్రవేశం, హరిజనోద్ధరణమని, గాంధీజీ చరకా ఝుూంకరణము శ్రవణశుభ గంగాగానము చేసినది. సర్వసమత్వ మను మంత్రరాజాన్ని భరతదేశం వల్లెవేయసాగింది. అరుంధతీ సుతుని నిరాశాకాశంలో. ఆశాతటిల్లతలు మోసులెత్తినయి. తన చిరకాల దాస్య క్లేశాన్ని విస్మరించినాడు. గబ్బిలం తిరిగి దర్శనమిచ్చింది. ప్రఫుల్ల వదనుడై తీయని స్వాగతమిచ్చాడు. పండా, కాయా యని ప్రశ్నించినాడు. పండై నదనిప్రకృతి ప్రత్యుత్తర మిచ్చినది. ఆత్మదేశం, ఆత్మభారతాంధ్రజాతిలో గల అనైకమత్యం స్వార్థలుబ్ధత, బహుకుల మతావేశ వ్యాధిపీడ, కాబట్టనితనం నేడవసి లోని తీరని వేదనలు తన దాస్యముక్తితోడుగా దేశానర్థకములైన అనేక విషమ సమస్యలతనిని కారింపసాగినయి. తన యిష్టదేవత తన జాతికి కేతన చిహ్నమైన గబ్బిలానికతడు మరికొన్ని చింతాసందేశాలను చెప్పుకొన సాగినాడు. గబ్బిలమా మూలాగ్రంగా ఆలకించింది. నోరులేని పక్షి మారుపలుకుటకు శక్తి చాలని ప్రాణి ఏమని యొదార్ప గలదు? ప్రదక్షణించి కన్నీరుకార్చి, శివాలయానికి తరలిపోయినది. అతని వాక్కులు చావులేనివై, వాయుమార్గమున ప్రతిధ్వనించు చున్నవి. గణబద్ధములైనవి. రెండవ గబ్బిలమను కావ్యమైనిలచినది. నేడుగాక మరొకనాడు ఫలించును. ఫలితమనుభవించు భాగ్యమతని కున్నదో లేదో.

గ్రంథకర్త

Joshua

# గబ్బిలం

## ◆ మొదటి భాగం ◆

చిక్కినకాసుచేఁ దనివిఁ జెందు నమాయకుఁ డెల్ల కష్టముల్
బొక్కెడు బువ్వతో మరచిపోవు క్షుధానల దగ్ధమూర్తి న
ల్దిక్కులుఁ గల్గు లోకమున దిక్కరియున్న యరుంధతీ సుతుం
డొక్కఁడు జన్మమెత్తె భరతోర్వరకుం గడగొట్టు బిడ్డఁడై

పూపవయస్సులో వలసపోయిన చక్కని తెల్గు కైతకున్
బ్రాపక మిచ్చినట్టి రఘునాథనృపాలకుఁ డేలియున్న తం
జాపురి మండలంఁబునకుఁ జక్కగ దక్షిణభాగ భూములన్
గాపురముండె నప్పరమ గర్భదరిద్రుఁడు నీతిమంతుడై

ముప్పు ఘటించి వీని గలిమిన్ గబళించి దేహమున్
బిప్పి యొనర్చు నీ భరత వీరుని పాదము కందకుండగాఁ
జెప్పులు గుట్టి జీవనము సేయును గాని నిరాకరింప లే
దెప్పుడు నప్పు వడ్డది సుమీ భరతావని వీని సేవకున్

వాని ఱెక్కల కష్టంబు లేనినాఁడు
సస్యరమ పండి పులకింప సంశయించు
వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనముఁ బెట్టు వానికి భుక్తి లేదు

వాని తలఁమీదబులిమిన పంకిలమును
గడిగి కరుణింపలేదయ్యొ గగనగంగ
వాని నైవేద్యమున నంటు వడిన నాఁడు
మూఁడు మూర్తులకును గూడఁ గూడు లేదు

పాముకు బాలు, చీమకుఁ బంచదార
మేపుకొనుచున్న కర్మభూమిం జనించు
ప్రాక్తనం బైన ధర్మదేవతకుఁ గూడ
నులికిపడు జబ్బు గలదు పీఁడున్న చోట

వాని నుద్ధరించు భగవంతుఁడే లేఁడు
మనుజుఁ డెట్లు వాని గనికరించు
వాఁడు జేసికొన్న పాపకారణమేమొ
యింతవఱకు వాని కెఱుకలేదు

ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి
యినుపగజ్జెల తల్లి జీవనము సేయుఁ
గసరి బుసకొట్టు నాతని గాలిసోఁక
నాల్గు పడగల హైందవ నాగరాజు

కులములేని నేను కొడుకులఁ బుట్టించి
యీ యఖాతమందె త్రోయవలెనె
భార్యయేలఁ బుట్టుబానిసకని వాఁడు
జరుపసాఁగె బ్రహ్మచర్య దీక్ష

ఉదయమాది రక్త మోడ్చికష్టముఁజేసి
యినుని సాగనంపి యిల్లు సేరి
యున్న గంజిఁద్రావి యొక్కనాఁడాపేద
ప్రక్కమీఁద మేను వాల్చియుండె

భూ నభములఁ గ్రొంజీఁకటు
లేనుఁగునకు మదము వోలి యెనక మెసంగె సం
ధ్యా నాట్య కేళి మాని మ
హానటుఁడు శివారవముల నారంభించెన్

ముక్కు మొగమున్న చీఁకటి ముద్దవోలె
విహరణము సేయసాఁగె గబ్బిల మొకండు
దాని పక్షానిలంబున వాని చిన్ని
యాముదపు దీప మల్లన నాఱిపోయె

తిల్లిక నాఱిపి దయ్యపుఁ
బిల్లవలెం దిరుగుఁదబిసిపిట్ట నరయఁగా
బల్లవితమయ్యె నాతని
యుల్లంబునఁ గ్రొత్త క్రొత్త యూహాంకురముల్

చెలిమిన్ బక్షికి విన్నవించుకొనఁజొచ్చెన్ స్వీయవృత్తాంతము
మ్మలికన్ గందిన నెమ్మనంబున మదోన్మత్త ప్రపంచంబులోఁ
బులుఁగుంబుట్రలుఁగాకఁ బేదలకు నాప్తుల్ చుట్టపక్కంబులు
న్గలరే వానికవోష్ణ బాష్పములు వ్యాఖ్యానించ జక్రాంగనల్

ప్రవిమల దేవతాభవన వాసముచేయుచు మమ్మువంటి మా
నవులకు లేని గౌరవమునం దులదూఁగెడు గబ్బిలాల రా
ణివిగద నీవు స్వాగతము నీకు శుభంబకదమ్మ నీతనూ
భవులకుఁ దల్లక్రిందుల తపంబులకున్ గుడి గోపురాలకున్

గాఢనిద్రావలంబియై కన్ను మూసి
క్ష్మాతలము మేను మఱచిన కాళరాత్రి
నా గృహంబున వెదకుచున్నా వదేమి
దొరక దిచ్చట నానంద కిరణ లవము

నిన్ను బహిష్కరించు నవనీవలయం బిది యంటరానివాఁ
డున్న నిషిద్ధగేహము సహోదరి నీవు సమస్త దేవతా
సన్నిధి నారగింతువు ప్రసాదము లంతటి పుణ్యురాలివై
యన్నములేని పేదల గృహంబులు సొచ్చితివేల బేలవై

హృదయములేని లోకముసుమీ యిది మాపులఁ బశ్చిమంబుగా
నుదయము తూర్పుగా నడచుచుండు సనాతనధర్మ ధేనువుల్
పిదికిన పాలు పేదకు లభింపవు శ్రీగలవాని యాజ్ఞలోఁ
బెదవిఁ గదల్పఁజాల రరవిందభవ ప్రముఖామృతాంధసుల్

ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుఁగాని దుః
ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప దీ భరతమేదిని ముప్పదిమూఁడుకోట్ల దే
వత లెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తు లాఱునే

పరమార్థంబులు బోధసేయుదురు లోభ స్వాంతులై నిత్యమున్
గురువుల్ ముక్కుకుసూటిగాఁదగులు యుక్తుల్పన్ని కైవల్యపుం
దెరువుల్చూపి మహాపరాధివనుచున్ దీర్మానముల్ సేయుచుం
దురు వేదాంతరథంబు సాగదనుకొందున్ నేను లేకుండినన్

ఒగిసంసారము దిద్దుకొంచుఁ గర మత్యుచ్ఛస్థితిం దూఁగుచుం
బగలెల్లన్ మునివృత్తినుండి యనుకంపన్ శర్వరీ వేళలన్
వగలందూలు దరిద్రమూర్తుల సమాశ్వాసింపనేతెంచితే
ఖగసన్యాసిని! యర్చురాల వకలంకంబైన మర్యాదకున్

గిరుల గుండెలు కరిఁగి నిర్ఝములట్టు
లుబుకుచున్నవి దిశల నన్నూఱడింప
బక్షికళ్యాణి, సోదర ప్రజలకండ్ల
నిర్గమించెనె యొక్క కన్నీటిచుక్క

చుట్టాలేగద వాలఖిల్యు లిన తేజుల్యోగవిద్యానిధుల్
పుట్టుందాపసు లార్ద్రచిత్తులు మహాత్ముల్ వైనతేయ స్తుతిన్
జెట్టుం గొమ్మఁ బరిత్యజించిన పరశ్రేయశ్శుభాకాంక్షు లో
పిట్టా: నీకు నమస్కరించెదను నా విజ్ఞప్తి నాలింపవే

ఈ ప్రశాంతరాత్రి యెల్లలోకంబును
బుజ్జగించి నిద్రఁ బుచ్చుకొనియె
నౌషధంబులేని యస్పృశ్యతాజాడ్య
మందభాగ్య నన్ను మఱచిపోయె

కర్మసిద్ధాంతమున నోరు కట్టివేసి
స్వార్థలోలురు నాభుక్తి ననుభవింత్రు
కర్మమననేమొ దాని కీ కక్ష యేమొ
యీశ్వరునిచేత ఋజువు చేయింపవమ్మ

ఆలయంబున నీవు ప్రేలాడువేళ
శివుని చెవి నీకుఁ గొంత చేరువుగ నుండు
మౌని ఖగరాజ్ఞి, పూజారి లేనివేళ
విన్నవింపుము నాదు జీవిత చరిత్ర

ఆపూజారులు విన్న నీకగును బ్రాయశ్చిత్త మీశానుఁడున్
గోపించున్ వివరింప నేమిటి నీకుం బొమ్ము వార్థక్యమున్
దాపై పెంజెడ దెల్లనై నది నిశీథస్త్రీకి నాఖేటక
వ్యాపారంబు ముగించి నీ పొరుగు గూబల్గూండ్లకున్ బోయెడిన్

పసమించు నీ గరుత్తుల
విసరి శ్రమంబడపి నన్నుఁ బ్రేమించిన నీ
యసమోపకారమునకుం
బసదన మిడలేక నే ఋణస్థుఁడ నైతిన్

నీనమస్కారముల నిక్కి నిక్కి నడవఁ
బక్షిణీ నాకు నుద్యోగబలము లేదు
మెచ్చఁదగు నీ కళాశక్తి నుచ్చరింప
ఖగసతీ! నాకుఁ గులము యోగ్యతలు లేవు

స్వార్థమున నిన్నుఁ గొఱముట్టువలె గణింపఁ
గడుపునిండిన భాగ్యవంతుఁడను గాను
దోషములు సూపి నీకు నీతులు వచించి
దొరతనము సేయఁగా మతస్థుఁడను గాను

మృగపక్షిత్వ విచిత్రధర్మములు మూర్తిన్ దాల్చియున్నట్టి నీ
మొగముం జూడదు లోక మట్టి శకునంబుల్ ప్రాతపట్టింపులు
న్దగవీ పేదకు రమ్ము గబ్బిలపుచానా నాదు స్వాంతంబులో
దిగులుంబాపి పినాకపాణి కొక సందేశంబు నందింతువా

ధర్మమునకుఁ బిరికితన మెన్నఁడును లేదు
సత్యవాక్యమునకుఁ జావు లేదు
వెఱవనేల నీకు విశ్వనాథుని మ్రోల
సృష్టికర్త తాను సృష్టి వీవు

నరునకుఁ జేరరాని సదనంబున వాసము సేయు నీశ్వరే
శ్వరునకు నానమస్కృతు లుపాయనమిమ్మొకవేళఁ గారణాం
తరముల వెండి పర్వతమున న్నివసించుచు నున్నఁ బక్షిసుం
దరి యొకపూట యానమకదా యిది నీకుఁ బరోపకారిణీ

గౌరీనాథుఁడు కాశికిం జనెడు మార్గంబందు రా మేఘపుం
జాఱున్ జుక్కలతోఁట నాటుకొని మింటన్నీకుఁ గన్పట్టు నా
దారిం బొమ్మొకవేళఁ జూచెదవు భూతస్వామిని న్నీకుఁ జ
త్వారం బేర్పడి దారిఁ దప్పెదవుగాదా భానుఁడేతెంచినన్

ఛత్రములవంటి నీలి పక్షములు విచ్చి
నీవు బ్రహ్మాండమునఁ బయనించు వేళఁ
జిత్తజల్లుల ముమ్మాయి ముత్తియములు
జలధరస్వామి నీమీఁదఁ జల్లఁ గలఁడు

మొలక సంధ్యారాగమునఁ గెంపు లెగఁ జిమ్ముఁ
జరమాచలంబునఁ జరణమూఁది

సెలయేటి నీట నీతఁలు గొట్టి విహరించు
మరుదంకురముల సన్మానమంది

కొండకొమ్ముల నెదుర్కొని తుత్తునియలైన
తోయదమ్ముల మీఁదఁ దుఱంగలించి

కలహంస పొదిగి పిల్లలుసేయు మిన్నేటి
జాంగలంబుల మీఁద సంచరించి

చిలుక లెంగిలింపఁ జిటిలి తేనియలూరు
స్వాదుఫలము లెలమి నారగించి
కొన్ని నాళ్ళపాటు కుటిల సంసారంబు
దిగులు మఱచి రమ్ము ఖగ వధూటి

సాత్వికాహారిణీ తపశ్చర్య కతన
నీ మనంబున జాలివెన్నెల రహించు
నాదు కన్నీటి కథ సమన్వయము సేయ
నార్ద్రహృదయంబుఁ గూడఁ గొంతవసరంబు

బిడ్డల గని పాలిచ్చెడు
దొడ్డతనంబున్న పుల్గు దొరసానివి నా
కడ్డుపడ   దిగిన వేలుపు
గిడ్డివి నా మనవి నాలకించెదవు గదా

నీయౌదార్యగుణంబు మెచ్చెదరు సందేహంబు లేకుండగా
నాయుష్మంతులు నీ కుమారులు మగండంగీకృతిం జూపి నీ
వాయెత్తైన నగంబు కొమ్మల విహాయ స్కేశు నావాసమం
చూయేలూగి కృతార్థురాలవయి రమ్మో పుల్గు పుణ్యాంగనా!

పక్షిసుందరి ని చిన్ని కుక్షి నిండ
నిన్ని నీరంబుఁ బలహార మున్నఁ జాలు
నెన్ని దేశాలు తిరిగిన నేమి నీకు
నీవు నావలెఁ బుట్టుబానిసవు కావు

తడవైనన్ గుడి గోపురంబులను సందర్శించుచుం బొమ్ము నీ
కడవుల్ కొండలు నడ్డు సేయవుగదమ్మా వ్యోమయానంబునన్
సుడిగాల్పు ల్సెలరేఁగినన్ నిలువవచ్చుం ధర్మసత్రాలలోఁ
బిడుగుల్ వడ్డఁ బ్రవేశయోగ్యతలు పాపిన్నాకు లేవచ్చటన్

అందందు ఫలవనంబుల
విందుగుడుచు చల్ల నల్ల విశ్రామ మణి
మందిరముల నిద్రించుచు
ముందుకుఁ జనఁదోఁచు నెన్నొ పుణ్యస్థలముల్

కొమరారు దంజనగరము
సమీపమునఁ గలదు తెలుగు సౌరభ్యంబుల్
గమ గమ వలచిన చోటది
యమరున్ రఘునాథరాజు నాస్థానంబున్

కృష్ణరాయలవారి యెడఁబాట్లు చీకట్లు
ముసరి దిక్కులలోన మసలువేళ
భూరి వాఙ్మయలక్ష్మి దారిబత్తెముతోడఁ
దంజాపురమువంకఁదరలు వేళఁ
వేంకటకవి తెల్గు పంకేరుహాక్షికి
శ్లేషోక్తు లలవాటు సేయువేళఁ
బచ్చ పచ్చని ముద్దుపళని ముద్దుల కైత
శృంగార రసము వర్షించువేళ

ముప్వగోపాల దేవుని పూజసేయ
ఘనుఁడు క్షేత్రయ కలమందుకొనినవేళ
నపరరాయలు రఘునాథ నృపతి విభుఁడు
కట్టుకొన్నాఁడు సత్కీర్తి కుట్టిమంబు

తనువుప్పొంగ సరస్వతీమహలు సందర్శించి తంజాపురీ
మనుజాధీశుల యోలగంబును పరామర్శించి పొమ్ముత్తరం
బునకున్ ద్రావిడభూములం గడచి పోబోదోచెడిన్ వాఁడువా
అని శౌర్యంబుసుమించుఁ దెల్గు పొలిమేరల్ నేత్రపర్వంబుగన్

యతియుంబ్రాసయులేని సంస్కృత కవిత్వారణ్యమందున్న భా
రతవేదానఁ బదేనుపర్వముల కాంధ్రత్వంబు నేర్పించి శా
శ్వతుఁడై పోయిన తిక్కయజ్వకు నివాసంబైన నెల్లూరికిన్
నతులర్పింపుము స్నానమాడు మతి గణ్యంబైన పెన్నానదిన్

ఒకపల్కు జాణతనమున
సకియలు నెల్లూరుసీమ సత్కవి వరులం
దికమకలు పెట్టఁగలరని
పుకారు గల దది యబద్ధమో నిక్కువమో

హంపీక్షేత్రముఁ జూచి పోవలయు నమ్మా తెల్గురాజ్యంపునై
లింప శ్రీల కొకానొకప్పుడది కేళీరంగ మేతద్రమా
శంపావల్లరు లాఁటిపోయిన ప్రదేశంబందు నీ బందుగుల్
కొంపల్గట్టి నివాస ముండెదరు నీకుం గూర్తు రానందమున్

పరదాపద్ధతి మాన్పిరో సిరికిఁ గుప్పల్ వోసి యంగళ్ళ యం
దురుమాణిక్యము లమ్మినారచట మున్నోపక్షిణీ మూరురా
యరగండండు మహేంద్ర వైభవముతో నాంధ్రక్షమామండలి
న్బరిపాలించిన నాఁటి పెంపును దలంపన్ మేను గంపించెడిన్

పగతు రసూయచేతఁ గరవాలమునన్ దనువెల్లఁ జెండినన్
జిగిరిచియున్న యుగ్రనరసింహుని భీమదృగంచలంబులన్
బొగలుడివోవలే దతని మ్రోల నిమేషము నిల్వజాలినన్
ఖగసతి నిన్నుధైర్యవతిఁగా గణియింతురు వీరయోధులున్

ఏనికవంటి సానువు గణేశుని నున్నని బొజ్జమీద గా
లూనఁగ లేదు తుమ్మెద తదుజ్జ్వలశిల్ప మఖండ తుంగభ
ద్రానది కప్పగించుకొని దద్దమలైన తెలుంగువారి వి
ద్యానగరాన జిందు మొక యశ్రుకణంబు నుపాయనంబుగన్

సరసుఁడు కృష్ణ భూవిభుఁడు స్వారియొనర్చిన పారసీహుమా
దొరల ఖురాగ్రహల్యలను దున్నిన భూములలోన నాంధ్రసుం
దరు లొకనాఁడు నాటుకొనినారు దిగంత జయప్రరోహముల్
గరిసెల నించినా రురువుగా ఫలియించిన సుప్రతిష్టలన్

మూరురాయరగండఁ డూరేగ డీనాఁడు
విద్యానగర రాజవీధులందు
మేలైన పట్టుడేరా లెత్త రీనాఁడు
పారసీక గుఱాల బేరగాంధ్రు
ఇనుపరోకళ్ళ సాధన సేయవీనాఁడు
కొమ్ము నిక్కిన భద్రకుంజరములు
తెలుఁగు స్కంధావారముల నిండదీనాఁడు
మరఫిరంగుల తెల్లదొరల దండు

మణిమయంబైన యాంధ్రసామ్రాజ్య రథము
భువికిఁ గ్రుంగిన పదియునాఱవ శతాబ్దిఁ
గృష్ణవిభు వీటఁ బ్రొద్దు గ్రుంకినది మొదలు
ఋషిఖగాంగన తెల్లవారినది లేదు

కంచర్ల శ్రీకృష్ణ గంధర్వుఁ డేలిన
నగరంబు దున్నించి నారు వోసి

వినుకొండ విభుని రాయని భాస్కరుని కోట
బురుజులూపున నేలకొఱగఁదన్ని

పల్నాటిదొరల శుంభత్ర్పతాపజ్వాల
సాటి కెక్కని నాగు లేటఁ గలిపి

వినుతిఁ గాంచిన కొండవీటి సామ్రాజ్యంబు
నుక్కుకత్తుల బావి కొప్పగించి

యుడుకు నెత్తుటఁ జేతులు కడిగికొన్న
కాలపురుషుని పెను దుండగములు దలఁచి
మనసు నలిగిన గుంటూరు మండలంబు
నరసి పోవమ్మ జన్మ ధన్యత వహింప

ప్రొద్దునకు వన్నెఁ బెట్టిన
యిద్దఱు భాస్కరులు పుడమి నేలఁగ సొగసుల్
దిద్దినది మేన వయసునఁ
బెద్దది గుంటూరు సీమ పెఱ సీమలలో

ఖరుచైపోయెఁ దెలుంగు రక్త మతిలోక స్వచ్ఛశౌర్యంబు సో
దరి! వ్యర్థంబగు కోడిపందెపు తగాదాలందుఁ బల్నాటిలో
నరుదారన్మివిలె న్వినోదముగఁ గార్యంపూడి తిర్నాళ్ళ త
త్కరవాలంబులు త్రుప్పుపట్టి యిపుడున్ గల్పించు నారాటమున్

కృతులంది కృతు లొసంగిన
వితరణ రతులైన కొండవీటి నృపుల యు
న్నతియుం బతనం బిప్పుడు
కృతులై కొండల నలంకరించి జితించెన్

విసిగి విరక్తిచేఁ దెలుఁగు వీధులలో నొక పిచ్చివానిగా
మసలిన రెడ్డిరాజు మునిమాన్యుఁడు వేమన యాశుధారగా
విసరిన కావ్యముల్ శ్రవణ పేయముగాఁ బ్రతిశబ్దఁ మీనెడిన్
దెసల నలంతి పోలికలఁ దీయఁదనంబున భావసంపదన్

జలదవ్రాతము తోఁడుగా యవలఁ గృష్ణాతీర దివ్యస్థలుల్
గలయంగ్రుమ్మగ సాగిపొమ్ము కవిలోకబ్రహ్మ నన్నయ్యకున్
నిలయంబై తగు రాణ్మహేంద్ర పురికిన్ విద్వత్సభారంజిత
స్థలికిన్ బూర్వచళుక్యభూపతుల రత్నస్థాపితాస్థానికిన్

ఎచ్చటఁ జూచినన్ బ్రతిపదించు కళంబలెఁ బచ్చపచ్చగా
రచ్చలకెక్కు గన్నడ సరస్వతి నారయ మానసంబులో
మచ్చరకించి నన్నకవిమాన్యుఁడు రాజమహేంద్రునానఁ దా
నిచ్చటఁ జేయిజేసికొనియెన్ బ్రథమాంధ్రకవిత్వ సృష్టికిన్

రెండున్నర పర్వంబులు
పిండిన రస మొలుకునట్టి పెను జెఱకుగడన్
బాండవుల చరిత నన్నయ
పండించెన్ దెలుఁగులోనఁ బ్రజ్ఞాన్వితుఁడై

జనవిభుండైన విష్ణువర్ధనుని నాఁటి
గౌతమీగంగ నీకు స్వాగత మొసంగు
పీరమాగాణముల నుద్భవిల్లునట్టి
గటికపోచయు నాకర్షకమ కదమ్మ

తొలి సారంగధరుండు వట్టి యపవాదు న్నెత్తిపైఁదాల్చిక
త్తుల్లపాలైన విషాదగాథ వినలేదో నీవు చిత్రాంగి మే
డలలో మూలుగుచున్న విప్పటికిఁగూడ న్బావురాల్ నీతికిన్
బలియైపోయిన రాజనందనుని దౌర్భాగ్యంబు నూహింపుచున్

అజ్జాయింతువా చుట్టుమార్గమని ద్రాక్షారామ భీమేశ్వరుం
డుజ్జీలేని దయాస్వభావుఁడు ప్రభావోల్లాసి ముప్ప్రొద్దులున్
గజ్జంగట్టెడి నాట్యగాఁడతఁడు సాక్షాత్కారమున్ జెందినన్
మజ్జాత్యుద్ధరణంబుఁగల్గ గలదమ్మా పొమ్ము సేవింపఁగన్

నిద్దంపు లేఁత కస్తురి
ముద్దవనుచు నిన్నుఁజూచి ముచ్చటపడి రా
ముద్దియలు ముచ్చటించెద
రొద్దిక శ్రీనాథకవి బహూకరణముగన్

అరవింద రత్న మండిత
తరంగరథ మెక్కి విభుని దర్శనముకై
పరువెత్తుచున్న గోదా
వరితోడుగఁ బొమ్ము దక్షవాటి నగరికిన్

అమృతమ్ము విషము వాక్కున
నమరిన కవిరాక్షసునకు నావాసంబై
కొమరారు నపరకాశిక
సుమి కడు మహిమాఢ్యమైన చోటది పతగీ

అల బుస్సీ దొర కొల్లగొటిన యనన్యంబైన మావెల్మవీ
రుల విఖ్యాతపరాక్రమజ్వలన మూర్పుల్ జిమ్ముచున్నట్టి బొ
బ్బిలి కోటం గని దాటిపొమ్ము చటులావేశంబు దేహంబునన్
మొలుచున్ బొల్చు కవోష్ణవీర రుధిరంబున్ జీవనాళంబులన్

నాయెడ జాలిలేక చరణంబునఁ గత్తులు గట్టి ప్రాణముల్
దీయఁదొడంగు రాజవితతిం దెలవార్చితిఁ దెల్లవారునే
నాయులివాలకింపని యనంత విభావరులంచుఁగొక్కురో
కోయని కూయుచున్న దదిగో తొలికోడి బడాయికొట్టుచున్

పూసపాటివారి ముఖ్యపట్టణమైన
విజయనగరమందు విశ్రమించి
జగము దద్దరిల్ల సకిలించినది తొల్లి
రాయరావు తుల గుఱాలదండు

కరవాలంబునఁ గొల్చి రాయలు పరిష్కారంబు గావించుచున్
సరిహద్దుల్ సవరించినాఁడటు లొరిస్సాదాఁక ఆరాజభా
స్కరుఁడెత్తించిన బొట్టునూరి విజయస్తంభంబుపై వెలుపుం
దెఱవల్ నిల్చి పఠింతు రాంధ్రులవిభూతిన్ ముక్తకంఠంబులన్.

నీవు బొబ్బిలి మీఁదుగా నిర్గమించి
మన్యము తరించి కొన్ని యామడలు నడువ
పలుచఁబడిపోవు మన జిల్గు తెల్గు శోభ
తావు లెగజిమ్ము నోఢ్ర వాతావరణము

తేటయైన తీపినీట దిక్కులదాఁక
విస్తరించి రుచులు గుస్తరించి
చిల్కసంద్ర మింపుసేయుచుఁ గన్పట్టు
స్వచ్ఛమైన తెల్గు భాష వోలె

చిట్టి మరు దంకురంబులఁ
బుట్టిన కెరటాల మొత్తములు తీరములన్
గొట్టుకొని మరలిపోవును
గట్టులెగయఁ జూచు చిలిపి కవనములవలెన్.

తగులు న్నీకట మార్గమధ్యమున బౌద్ధస్తూప శైథిల్యముల్
మగధోర్వీశుల రాణివాసములు లీలాభర్మ హర్మ్యావళుల్
జగముల్మెచ్చిన శాక్యసింహుని యహింసాసూక్తి మాధ్వీక ని
మ్నగలం దేలిన పుణ్యభూములు నలందా పాటలీ పుత్రముల్

ముక్తి దంబులైన పుణ్యస్థలములందుఁ
బ్రథమగణ్య మమ్మ వారణాసి
అన్నపూర్ణసేయు నాహారభిక్షతో
ముక్తిభిక్ష నీకు ముట్టగలదు

నదుల తోడికోడలు దధీశు పెదభార్య
జాహ్నవీ స్రవంతి జలము దేర
అతిథి పూజసేయ నన్నపూర్ణాదేవి
వారణారిఁ గూడి వారణాసి

కలరు కళాసముద్రములు గట్టులు రాయగ నీదినట్టి ధీ
విలసితులైన పండితులు పెక్కురు వేదపురాణ శాస్త్రముల్
బలికిన సత్కవీశ్వరుఁడు వ్యాసమునీంద్రుడు శిష్యకోటితో
మెలగెఁ నొకప్పుడుండు నట మేచక కంఠుఁడు విశ్వనాథుఁడై

మొగలాయి చక్రవర్తుల
మృగాంక కేతనము నింగి మెఱసిన ఢిల్లీ
నగరంబు దృష్టి గోచర
మగు ప్రోన్నత సౌధచుంబితాంబోధరమై

ఆ ఢిల్లీపుర హస్తినాపురి సమాఖ్యన్ ద్వాపరంబందుఁగొం
డాడం బడ్డది ధర్మజుండచట రాజ్యంబేలి చేయించినా
డీడుం జోడును లేని జన్నముల నెన్నేఁ గన్నులున్నందుకున్
జూడన్ దగ్గ పురంబు సుమ్మచట వీచున్ భోగసౌరభ్యముల్

ముడిచె నిచ్చట కుంతి కొడుకు ద్రోపది కొప్పు
పగవాని రుధిరంబు పరిమళింప

మెఱసెనిచ్చోట నాదరుషా కుఠారంబు
నిఖిల భారతము కన్నీరు నింప

వెలసె నిచ్చోట పచ్చల బర్హిపీఠంబు
షాజానురాజునాస్థానవాటి

పెండ్లాడె నిచ్చోట పృథ్వీరాజొక రోజు
జయచంద్రు సుతను దోస్సార గరిమ

యుగయుగాల కథల నుదరాన జీర్ణించి
రాజరక్త నిర్ఝరములఁ దేలి
నవ్వుచున్న ఢిల్లీ నగరంబు నందంబు
తరుగులేదు శిరము నెరయ లేదు

సులతానీ సులతానులన్ మణిగణాంశుల్ దట్టుమిట్టాడుమే
డలలో వాసము చేసినారు నిజరాష్ట్రంబాకటందూలఁబే
దలనోరూర భుజించినారిచట ముక్తారత్న పాత్రంబులన్
గలమాన్నంబు సుఖించినా రఖిల భోగశ్రీ మహాడోలలన్

కుతుబుద్దీనుడు నిల్పిన
కుతుబుమినారనెడు గొప్ప గోపురము సము
న్నతమయ్యుఁ జెక్కు చెదరదు
శతాబ్దములనాఁటి శిల్ప చకచకితం బై

చామనచాయ గలట్టిది
కామజనకు ననుఁగుభార్య కాళింది వినీ
లామ కోమలవీచీ
చామరములువీచి నీకు స్వాగతమిచ్చున్

సూనుని కాయిలా తనకుఁ జొప్పడు లాగు నమాజుజేసి య
ల్లానలరించి యాదిమొగలాయి నరేంద్రుఁడు బేబరుండుమా
యూనున కాయురున్నతులు సృష్టియొనర్చిన చిత్రగాథ ఆ
గ్రానగరంబు కర్ణ శుభగంబుగ నీకు నుపన్యసించెడిన్

షాజాను నశ్రుజలకణ
మీ జగముపురంద్రి దాల్చు నేడవ నగ ముం
టాజమహలు నిద్రించెడు
తాజమహలు దృశ్యమద్భుతంబు పతంగీ!

కుహనా గోపుం డాగమ
రహస్యమగు గీత బాహిరము చేసిన శ్రీ
మహిత కురుక్షేత్రంబున
విహార మొనరించి పొమ్ము విహగవధూటీ

సః నస్తుత్యుఁడు బోధిసత్వధరణీశుండర్ధరాత్రంబునన్
నిజవాసంబుఁ బరిత్యజించి యతిశాంతి స్థాపనేచ్ఛా మనోం
బుజుఁ డై బిచ్చుఁ పుగిన్నె ఁదాల్చిన మహాపుణ్యప్రదేశంబులన్
మజిలీ సేయుము రెండునాళ్ళు ఖగభామా! జన్మసిద్ధించెడిన్.

లుంబినీ వనపరిమళోల్లసిత మగుచు
నేఁగుదెంచెడు నీకర్ష్మి మీయఁ గలదు
గౌతముం డాదరించిన కనకహంస
నీరు గలియని మధుర గోక్షీరధార

దర్శింపగలవు గౌతమబుద్ధదేవుని
ప్రాచీన భరత శిల్పంబునందు

సాధింపఁగల వహింసా మంత్రరాజంబు
శాక్యసింహుని కాలి జాడలయందు

తెలిసికోఁగలవు బౌద్ధుల సాహితీ సేవ
అమరసింహుని కవిత్వమునయందు

వీక్షింపగలవు కపిలవస్తు నగరంబు
నాశన దేవ్యధీనంబు నందు

రెండువేలేండ్లు క్రింద నిద్రించుచున్న
మౌర్యరాజుల విపుల సామ్రాజ్య చరిత
యేకరువు పెట్టు ప్రకృతి యం దాకళించి
వెచ్చ వెచ్చని కన్నీరు విడువఁగలవు

అక్కడనుండి యుత్తర దిశాభిముఖంబుగ నిర్గమించు నీ
దృక్కుల నడ్డుచున్ హిమగిరీంద్రము దర్శనమిచ్చు దానిపై
నెక్కగనెంచి తెల్లదొర లీలిగిరెందరొ! వారి దేహముల్
స్రుక్కవు నేఁటికిం బులుఁగు సుందరి మంచుమహత్త్వ మెట్టిదో

కరఁగిన మంచు బండలు ప్రగాఢభరంబునఁబట్టుదప్పి, త
ద్గిరి శిఖరాల నుండి తలక్రిందులుగా దిగజారి లోయలన్
దిరిగెడు జీవరాసుల వధించుచు నుండును పేదవారికిన్
జెఱపె కదా! బలాధికుల నేయము సంయమి పక్షిభామినీ!

అందు నెవరెష్టు శిఖారన నధివసించి
వ్రాసికొనవచ్చు భరత వర్షంబు పటము
దాని యున్నతి తారకాధ్వజము మిగులు
సులలితములైన కవుల యూహలకుఁ దఱుగు

కలహంసల్ సనువాయుమార్గముల రేఖల్ పర్వతాగ్రంబునన్
గలవాత్రోవల దక్షిణోత్తర దిశాగ్రవ్యాప్తముల్ ప్రోన్నతం
బులు నీకుం జన గాదు నిచ్చలు నిలింపుల్ గుంపు లై రాకపో
కలు గావించెడు వెండి కొండ వెరవుల్ గన్పట్టు నైమూలగన్.

విహిత కైలాసయాత్రగావించు నిన్ను
మంచుకొండల విభుఁ డాదరించఁగలడు
అల్లునకుఁ గూతుఁనకు వార్త లంపునేమొ
సమ్మతింపుము నుడులు భారమ్ముగావు

అస్త్రవిద్యాభ్యసన వేళ నద్భుతముగ
కొంచకొండకు రంధ్రంబు గొట్టినాఁడు
చిన్నతనంబున బార్వతి చిన్న కొడుకు
తారకాగిరి కదియ యుత్తరపు గవిని

గిరుల మగవాని చెలిమి వ్యక్తీకరింప
మస్తమునఁదాల్చు మొక చిన్ని మంచుతునక
వినపుమేతరి కది సిఫారసుగ నుండు
వ్యర్థములుగావు పెద్దల పరిచయములు

మంచుఫలించు నగ్గిరులమాడులఁగాఱు మొయిళ్ళపై నుడా
యించు గమింపు మవ్వల మహేంద్రుని వీడు త్రివిష్టపంబు గ
న్పించు డలాయిలామలను వింత నృపుల్ పరిపాలనంబు సా
గించెద రిప్సు డచ్చరలు క్రీడ యొనర్పరు నందనంబునన్

ఆలామాలకుఁ బెండ్లి పేరటము లే దాజన్మసన్యాస దీ
క్షా లగ్నాశయులై ధరింతు రతి దీర్ఘంబైన కుళ్ళాయముల్
మౌళిన్ వారి యనుజ్ఞలేక విహరింపంబోల దెవ్వారి కా
నేలన్ బక్షివి నీకుఁ బోదగని క్షోణీమండలం బుండునే

ఆ రాజ్యంబును గూబపట్టుకొని బిట్టాడించుచుండున్ దురా
చారంబుల్ వెడ నమ్మకాల కది వాసస్థాన మస్పృశ్యతా
క్రూరవ్యాఘ్రము సంచరించుటకు సంకోచంబులే దైన బౌ
ద్ధారామంబులు సాగనీయవు గదమ్మా! దాని యౌద్ధత్యమున్

అసమ రుచిరాంబువైన మానస సరస్సు
కన్న కూఁతురు బుడుత గంగాభవాని
యెక్కి దిగుచుండు కొండల చక్కఁదనము
ప్రేక్షణీయంబు సుమ్మ గబ్బిలపుదేవి

బలిసిన మేనులన్ జడల బత్తెల కొమ్ముల వింత సింహముల్
బలె విహరించుఁ గొండల యుపత్యకలన్ సెలయేటినీళ్ళ గ్రో
ల్పులుల కళేబరా లచటి లోయలలో బొరలాడు వాని య
మ్ముల కెనయైన శృంగముల పోటుల దూటులు బడ్డపొట్టలన్

జడనిధివంటి మానసము సాటికిరావు సరస్సులెల్ల నం
దుడుగక రేఁగు పేరలల యూపున గట్టులఁదాకి ప్రాణముల్
విడిచిన గండు చేపలుఁ గుళీరము లెల్లడఁ దీరభూములం
దడుగిడరాక చీకి వికలాంగములై పడియుండు గుట్టలై

దమయంతీ నలులకు దౌ
త్యము చేసిన తొంటి పసిఁడి హంస విభుని చు
ట్టములందు పంకజోద్యా
నములందున నాలపించు నైషధ కథలన్

నిండిన దోరవెన్నెలల నిక్కిన పచ్చిక మేసి, చాందినీ
కొండబయళ్ళలోఁ దిరుగు గోపతి నీకగుపించు నందు వే
దండవిరోధి దాల్చి జటులాటవిఁ బూచినపూవు చంద్రమా
ఖండము గోచరించు నెఱుకల్గల నీ కెఱిగింప నేఁటికిన్

విలు నమ్ముల్ ధరియించి చెంచులు తదాభీలాటవీమధ్య భూ
ముల గన్పట్టిన నంజలింపుము మహోత్ముండైన భర్గుండు భ
క్తుల కిష్టార్థము లీయఁగోరిన గణస్తోమంబుతో మాయ పం
దుల వేఁటాడుచు భిల్లుడై నరుల కన్నుల్ గప్పి క్రీడించెడిన్

అచ్చోటి తపసి రాజులు
నిచ్చలుఁ దపమాచరించు నీ కాతిథ్యం
బిచ్చెదరు పరుల విద్యలు
మెచ్చెద రీ గుణము నేఁడు మృగ్యంబ కదా

ఇప్పటికిఁ గూడఁ గ్రొంబొగ లెగయుచున్న
త్రిపురముల ప్రాఁత బూడిద దిబ్బ లచటి
కనతి దూరాన నీకుఁ బ్రత్యక్ష మగును
చిత్రముగ పానమున కెంత చేవ గలదొ

వలరాజు పగవాని గొలచి ముందుకు సాగు
తొలకరించిన నీలి జలధరంబు

మహిషుని వనిత లుమ్మలికింప గర్జించు
సితికంతు నిల్లాలి సింహరమణి

కొసరి దిక్కులు మేలుకొలిపి గానము సేయు
కొమరుసాముల వారి కోడిపుంజు

తలఁమీద రతనాలు మొలిచి ముద్దులుగార
నటియించు సర్పంబు నటకురాలు

కనులఁ జూచి రమ్ము కైలాసభూముల
వింతలెల్లఁ దెలుప వేళకాదు
నీకు శుభము గల్గు నిఖిలామరశ్రేణి
సరసుఁడమ్మ బాలచంద్ర ధరుఁడు

రేగిన గంధపుందరు పరీ మళముంగని మోసపోయి యం
దాగి పదంబుమోపవల దచ్చట కొమ్మల నా్రశయించి మి
న్నాగులు తాండవించు మరణంబును బుక్కిటఁబట్టి యాపదల్
డాగిన తావులే వలపులం దొణికించి మనస్సు నీడ్చెడిన్

పుడమి ననంతకాల రథమున్ గదలించి మనుష్యకోటిపై
నడిపి నశింపఁ జేయు యతనంబులు నీ బెదరింపు లిచ్చటన్
జడవని రుండమాలికలు పండ్లిగిలించి వెడంద నోళ్ళతో
మృడుని గళంబునన్ జెనటిమృత్యువుతో వెకసక్కె మాడెడిన్

ఒలికిపోయిన పండువెన్నెలల పాలు
గ్రోలుచున్నది తపిత చకోరకంబు
ప్రొద్దువోయెను నీ చిన్న భోజనమును
వెదకికొనఁ బొమ్ముతబిసి గబ్బెతల రాణి

వీనులు చిన్నవోవ వినిపించు నదే డబుడుక్కువాని ఢ
క్కా నినదంబు తూరుపు ముఖంబుగ హైందవవీధి సభ్యతా
స్థానముగల్గు తాను మన సఖ్య మెఱింగినఁ గంటగించు నో
మౌనిశకుంతమా చను ముమాపతి మేడకుఁ గోడి గూసెడున్

న న్నొకమారు నీ దరిసెనంబున దేల్చినవాడు ధన్యునిగ జేసి భర్గుఁడే
మన్నది చెప్పి పొమ్మ విబుధాలయ వాసిని నాకు లేరు నీ
కన్న శరణ్యు లాప్తులు వికాసితమైనవి తూర్పు రేఖలున్
కన్నఁపు దొంగతోడ సదనంబునకుం జనుమమ్మ పక్షిణీ

ద్వారములు లేని నాదు కుటీర లక్ష్మి
స్వాగతం బిచ్చి నీకు మర్యాదచేయు
నా యనుజ్ఞకు వేచియుండంగ నీకు
వలదు వలదమ్మ రాత్రిం దివంబులందు

నిద్దుర మేల్కొని యల్లన
ఖద్దరు రాట్నంబు పౌరకాంత వహించెన్
ప్రొద్దు పసివాఁడు తూరుపు
ముద్దియ పొత్తిళ్ళలోన ముద్దులు గురిసెన్

వాని యిష్టార్థములు కూర్చుదాని వోలె
విశ్వనాథుని గుడికి గబ్బిలము సనియె
వేయిచేతుల పెనుకాపు వేగిరింప
గచ్చు బిగియించె నప్పేద కార్మికుండు.

## ♦ రెండవ భాగం ♦

బహుదేశ మత మహాపరిషత్తు తలయూచ
పలికి వచ్చినది మా భరతసుతుఁడు

కండెబొట్టున నైదు ఖండాల నోడించి
కొలువులందినది మా కోమటన్న

సీమలో నాచార్య సింహపీఠికమీద
నిలిచివచ్చినది మా తెలుగువాఁడు

విశ్వసన్మానంబు వెలయ నోబెలు కీర్తి
రంగ మెక్కినది మావంగసుకవి

చెట్టుచేమల సుఖదుఃఖ జీవితములు
నిజము దేల్చినాడు మా నేలవాడు
నన్ను దొలగించి లెక్కించినారు గాని
మొదట నెల్లర మన్నదమ్ములము మేము

గబ్బిల మేమని చెప్పెనో
గుబ్బలి యల్లుండు కన్ను గోనల నశ్రుల్
గుబ్బటిలలేచి నల్లని
మబ్బులలో తక్షణంబ మాయంబయ్యెన్

తిరువానుకూరు దేవుఁడు
తెఱచెం గుడితలుపు లితర దేవుండ్లును బి
త్తరవోయి నిమ్న జాతుల
దరిసెనమున దరిసి రాత్మదౌర్భాగ్యదశల్

అంటరాని తనంబునంటి భారతజాతి
భువనసభ్యత గోలుపోయెననుచు
క్షమకు మించిన కత్తి జర్మనీ యుద్ధాన
గనుగొన్న మొనగాడు గలుగడనుచు
కదురు రాట్నము చేతగాక స్వేచ్ఛా స్వర్గ
ముదముజిక్కుట నభఃపుష్పమనుచు
నూరేండ్లు గాదు మున్నూ రేండ్లు మనవచ్చు
న్యాయమార్గంబున నడువుడనుచు

నిమ్న జాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చి వేయుననుచు
రాట్నమును దుడ్డుగఱ్ఱ కరానబూని
దెసలదోతెంచె గుజరాతు ముసలిసెట్టి

సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్లె
ముతకబట్టకు మర్యాద పాటమరించె
నగరివెలుపలి మాలమాదిగలు గూడ
నరులుసుమ్మని దేశంబు గుఱుతుబట్టె

వెఱపువలదు నీకు హరిజన సోదరా
స్వీయరాజ్యరథము వెడలివచ్చె
లాగిపొమ్ము నీకు భాగంబు గలదంచు
బాడుచుండె రత్న భరతమాత

ఒకనాడా మునిపక్షి తొంటి చెలికా డున్నట్టి గేహంబు లో
నికి నేతెంచి యధావిధిం దిరుగుచుండెన్ మిత్రుడీక్షించి యు
త్సుకతం బొంగిఁదరస్మితంబున నిదే జోహారహో పక్షిణీ
యకలంకంబగునీ సహాయమున నాయర్థంబు పండాయెనే?

నావర్ణించిన పుణ్యభూములను సందర్శించినావే మహా
దేవుం డాయన దేవియుందగిన యాతిథ్యంబు నీ కిచ్చిరే
నా వాక్కుల్ జెవినాటితే మహితరత్న స్వర్ణకాంతి చ్ఛటా
ద్యావద్దివ్య హిమాద్రికందర పవిత్రక్షేత్రముల్ సూచితే?

పుడమి కలుషరాశి మ్రుగ్గిపోవుచు నుండ
నాట్యమాడుకొనుట న్యాయమగునె
భర్గదేవ! సృష్టి పరికించి పొమ్మంచు
బిలిచివచ్చినావె పులుగుచెలియ

కాళిదాసుని మేఘంబు గౌరవంబు
తెచ్చుకొన్నదె నీదు సందేశ గాథ
ఘనులుచేకొను భూ భృదగ్రముల పూజ
యసమ చతురత్వమున్న బానిసకురాదు

వ్యాస వాల్మీకిముని మదేభములు రెండు
దిరుగుచుండెనె కైలాస గిరులమీద
వారి వార్థక్యమున నీకు స్పష్టమగును
భరత రామాయణంబుల పడుచుఁదనము

ఆ వాల్మీకి నిసర్గజంతు కరుణావ్యాసక్తియే సత్కవిన్
గావించెన్ వెడలించె రామునికథా గాంగేయముం గానిచో
త్రోవల్ గొట్టెడు బోయ కేగురువునేర్పుం దివ్యగీర్వాణమున్
ఆవేశించి కళాధిదేవి వరమీయన్ విద్యలేమాత్రముల్

ఎదురైవచ్చెనె కాళిదాసుని లసచ్ఛృంగార సందేశ మం
బుదమార్గంబునఁద్రసంబులు ధ్వనుల్ ముత్యాలు వర్షించెడిన్
పదినూరేండ్ల పురాణ మేఘమనుచున్ భావింతువో నిత్యముం
బదియారేండ్ల వయస్సు కూర్పదె సుకావ్యస్పర్శ జేజెమ్మకున్

జనముల్ మెచ్చు రసప్రసిద్ధమగు నా సందేశ భారంబుతో
జనముల్ వచ్చు విమానమాలికల గర్జాభీషణంబౌ ప్రభం
జన మార్గంబున నీప్రయాణమెటులన్ సాగించి నెగ్గించితో
చెనుకన్నేరవు గండముల్ తబిసిపక్షీ జన్మసన్మార్గులన్

కన్నులు ధన్యంబులుగా
కన్నావే మంచుకొండ గగనము శిరముం
దన్నెడు దాని నమరగవి
వెన్నవలెం ధవళరుచులు బిండెడుదానిన్

ఆ కొండయే యిండియా విరోధులదండు
గుండెగాలం బైన వెండికోట

ఆ కొండయే ముత్తియపుదండ భారతో
ర్వీమాతృమణికిఁ గిరీటభూష

ఆ కొండయే పర్వతాగ్రగణ్యములైన
కులపర్వతముల నిక్కులకునిక్కు

ఆ కొండయే రజతాచలస్వామికి
మణిమయ కళ్యాణ మంటపంబు

సింధుగంగా మహానదుల్ చిన్ననాడు
ప్రాకనేర్చిన యపరంజి ప్రస్తరములు
పాదచిహ్నాలు పరికించి వచ్చినావె
కలుషములు వాయ కన్నుల కలువుదీర

ఇంద్రధనువుబట్టి సాంద్రాబ్దవనవాటి
మెలగు చున్నవాడు మృగయుఁడొకఁడు
వాడు గొంతుబిసిగి వసుధపై విసరిన
జంతుతతులు నిమ్నజాతి జనులు

ఆగర్భ ప్రతిభా సముద్రులగు శిల్పాచార్యు లూహింపగా
మూగంబడ్డ శకుంతముల్ పలికి గుంపుల్ గట్టి కీర్తింపగా
వేగుంజామున రంగులద్దు నల శిల్ప బ్రహ్మ దేగ్రామమో
భోగట్టాగని వచ్చితే రసమయంబుల్ తత్కళా పద్ధతుల్

బెళుకుంజూపులు గుల్క పోకడలు చూపీచూపకూరించుచున్
జలదాగారములందు దోచెదరు కన్యల్ కొందరీక్షించితే
పులుగుంజేడియు యబ్ధిగర్భములలో ముత్యాలుపండించి భూ
ముల కర్పించెదరంట మేటిగహనంబుల్ సృష్టివైచిత్రముల్

ఎంతకోయిలపాట వృథయయ్యెనో కదా
చిక్కు చీకటి వనసీమలందు
ఎన్ని వెన్నెలవాగు లింకిపోయెనొ కదా
కటిక కొండలమీద మిటకరించి
ఎన్ని కస్తురిజింక లీడేరెనో కదా
మురికి తిన్నెలమీద పరిమళించి
ఎన్ని ముత్తెపురాలు భిన్నమయ్యెనొ కదా
పండిన వెదురు జొంపముల లోన

వెలవాఁ్రుచ్చుగారాని భావముల నన్వేషించుచున్ సత్కవీం
ద్రులయూహల్ విహగంబులై తిరుగుచుండెన్ బ్రోన్నతాకాశమం
డలమస్తంబున నాకళించితె ప్రయాణశ్రాంతి నమ్మించుకొం
డలకున్ డిగ్గెడి నీవిశేషము రసజ్ఞజ్ఞేయ మూహింపగన్

వడుకునూలుచేత బగ్గాలు పేనించి
దొడ్డమృగయు డుచ్చు లొడ్డినాడు
తగులుకొనునొ కాక తప్పించుకొనునొక్కొ
స్వీయరాజ్య మనెడు సింహరాజు

నరులన్ ముట్టక నందులం గొలిచి పుణ్యంబెల్ల సాధించున
ప్పరమంబైన రహస్యమున్ శివునితో ప్రస్తావముం జేసితే
పరమేశుం డివి నిమ్న జాతులకు సంప్రశ్నింపగా రాని వే
ద రహస్యాలని కోపగించుకొని స్వార్థంబున్ బ్రదర్శించెనే

బసుమంబు బూసికొని యే
రసికతలేకుండ బ్రదుకు ప్రమదుల నడుమన్
రసికుడగు సుకవి జీవిత
మసిధారావ్రతము వలవ దది శత్రులకున్

ఎవరికివారై బ్రదుకుచు
నవీన ధర్మముల పిచ్చినమ్మకములతో
నవరించి ప్రజల తలలో
ప్రవేశ మొనరించు స్వార్థపరులంగంటే

దిరుసుల్ మార్తురు కొందరాంధ్రులవురా దేశాంతరంబేగి వ
త్సరముల్ పుచ్చిత్రివిష్టప్రజలతో సఖ్యంబుగావించి యె
బ్బెరికం బైన విదేశ నాగరికతన్ విచ్చేయకచ్చాంధ్ర సుం
దర వేషంబు ప్రతిష్ట నిల్పితివి సన్మానార్హ వెంతేనియున్

చెప్పక చెప్పుచున్నది విశేషములేదని నీ మొగంబునే
తప్పొనరించి యింతటి వృథాశ్రమ యిచ్చితి మాయదృష్టముల్
దప్పిన దప్పని మ్మనుగుతమ్ముల శ్రేయముగోరి భర్గునిన్
గుప్పెడు గుండెతో యెదురుకొంటివిదే పదివేలు పక్షిణీ!

అపజయంబులు విజయ గేహంబు నిలుచు
స్తంభములు సుమ్మ నీకు విచారమేల
కొద్ది కొద్దిగ నిక్కిన గోడవోలె
సగము సగములుగా పనుల్ ముగిసిపోవు

ఓటమిలేదు నా యతన మూరకపోదు తుఫానువోలె నా
మాట లుమామహేశ్వరుల మానసముం గదిలించితీరు క
న్నీటమునింగి పైకుబుకు నిర్మలసూక్తి ఫలింపకున్న చో
రాటముతో స్వరాజ్యము విరాజిలుటల్ కృతక ప్రచారముల్

పలనాటన్ మును బ్రహ్మనాయని కృపాబాహుళ్యనేత్రంబులో
పల నాటంబడి నాయురాలి కృతక వ్యాపార దావంబులో
పల భస్మంబయి సంఘసంస్కరణ దివ్యద్బీజ మీనాటికిం
ఫలియించెంగద గాంధిచేయతనముల్ వ్యర్థంబుగావెన్నడున్

నీకావించిన రాయబారమునకు న్నిత్యాభిషేకంబుగా
నాకన్నీటిని కాన్కగా యొసగుచున్నానో దయాశాలినీ
చేకొమ్మింతకుమించి నావలన నాశింపంగ లేదిట్టి నీ
బాకీ దీర్తు స్వరాజ్య సౌధమున నావాసంబు సిద్ధించినన్

ఏజాతి కెంతవచ్చునొ
రాజత్యంబు నాకు రావచ్చు గదా
నాజాతి యెత్తు కేతన
రాజంబున నీదుమూర్తి వ్రాయింతుఁజెలీ!

పెల్లుతమస్సులోన దురపిల్లెడు మాబ్రతుకుం దనుస్వినుల్
భల్లున దెల్ల వార్చగల బాబులు పెద్దలనేకు లుండగా
దెల్లనివేల్పు భిక్షకుని దిండికి బట్టకులేని కొండరా
యల్లుని నాశ్రయించి యకృతార్థుడనైతిని పిచ్చివాడనై

మఱచితి నాదిదేవుని సమానుఁడు బుద్ధునియంతవాడు భా
సుర దరహాస చంద్రికల శుభ్రత లోన గలట్టివాఁడు య
ద్దారలకుగాదు వారి చెవిదూరినవారిని లక్ష్యపెట్టఁడ
ప్పరమమునిన్ సబర్మతి నివాసిని జూచితివే తపస్వినీ

ముల్లోక్కించుక వాలిపోయినను బాపూజీకి దీటైన శ్రీ
వల్లాభాయి పటేలు దర్శనము సంప్రాప్తించెనే నీకు నే
డల్లంతన్ గనుపట్టుచుండెడు స్వరాజ్యార్థంబుకై సర్వమున్
గొల్లంబెట్టిన త్యాగి తానత డెఱుంగున్ నా మనఃక్లేశమున్

ధిక్కారించెడు రాచగుఱ్ఱముల స్వాధీనంబు గావింపగా
యుక్కుంగళ్ళెము జవ్వరుం డతని విద్యుచ్ఛారదామూర్తి న
ల్దిక్కుల్ నిండి నటించుచున్న దనుచున్ దేశంబు లగ్గించు మా
చిక్కుల్దీర్చుట విస్మరింపడుగదా స్వేచ్ఛాజయాంతంబునన్

పసుపుం బచ్చని పూతబూచినది ముప్పన్నెల్పొసాలింపఁ గాం
గ్రెసు మందార మనంతశాఖికలు నిక్కెన్ దిగ్దిగంతంబులన్
పసలేర్పడ్డవి సర్వవర్ణములకున్ దచ్ఛాఖిశాఖాతతిన్
వసియింపన్ మనకుండదే స్థలము దివ్యన్మౌని పక్షీశ్వరీ!

కలడంబేద్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం
బలియై సీమకుపోయి క్రమ్మరిన విద్వాంసుండు వైస్రాయిమే
ల్కొలువందంగల దొడ్డవాఁడతఁడు నీకున్ స్వాగతంబిచ్చి పూ
వుల పూజల్ వొనరించెనే యతనిమెప్పుల్ నీజయారంభముల్

నేను నాకను సహము ఖండింపలేక
పదియు నెనిమిది శాస్త్రాలు పదును లుడిగె
నీవు నే నను సమత సంధింప గలిగె
తీవ్రతరమైన చిన్న మౌనవ్రతంబు

వచ్చినవారు సీమనరపాలుర మంత్రు లభీప్సి తార్థముల్
దెచ్చిరి ప్రేమతో భరత దేశజులం దనియింపవచ్చి పో
వచ్చు స్వతంత్రభారత సువర్ణకిరీటము నేడుగాక రా
వచ్చు మరొక్కనాడు నెలవాసిన తొయ్యలి తీర్థమాడదే?

గుడిలోదేవుడు చూచిపొమ్మనుచు నాకున్ వార్తలంపింపగా
దొడగెన్ నల్వురచేత నీవెనుకవత్తున్ నన్ను రమ్మందువా
తడవైనన్ మరణింతురెందరొ విముక్తాహార దీక్షాపరుల్
నడుమన్ నేనుసహింపజాల నొక యాంధ్రప్రాణి శుష్కించినన్

గబ్బిలమవయ్యు శివుని లోకంబునందు
వలయు కదలిక గలిగించి వచ్చినావు
నిశ్చలంబైన కాసార నీరమునను
నలతి శిల చాలదే వలయములదీర్ప

అర్థించి చనుదెంతు నగ్రహారముకన్న
సర్వేశ్వరుని యింటి చౌకదనము
అడిగివచ్చెద వీటి నడిబజారునకన్న
గుడిగోపురముల తక్కువతనంబు
పలికించికొనివత్తు బంతి బువ్వలకన్న
తీర్థప్రసాదాల దేబెతనము
ప్రశ్నించివత్తును రాచబావులకన్న
పాతాళగంగమ్మ పలుచదనము

నిజము దేలిచికొనివత్తు నిన్న నేడు
నన్ను జూచిన నల్లంత నడుచుతనము
గుడికిరమ్మనినంతనే యొడలుమఱచి
పరుపులెత్తుట నాకంత పరువుగాదు

ఎంతో దూరము పోవనేమిటికినే డింటింటికిం బ్రాకి యా
శాంతవ్యాప్తముగా రహించెడు స్వరాజ్యస్వర్ణసూత్రంబు చౌ
దంతి స్తంభన మాచరించెగద యేతద్దివ్యసూత్రంబు మో
కంతై నిక్కినకట్టివేయుగలదా యస్పృశ్యతావ్యాఘ్రమున్

చాటింపించి మదీయజాతికి నభీష్టంబుల్ ప్రసాదింపగా
పూటా పద్ధతి కొంతభారమది రేపో మాపొ రావచ్చు నీ
నాటంగాదని కొంతభారతము పంతంబొప్ప వాదించు నీ
వోటెవ్వారికొసంగితో తెలిపి నన్నోదార్చవే నెచ్చలీ

ప్రియములుగాని సత్యములు పెక్కులు నేను వచించుచుంటి నీ
దయకెడమైె తపింతునొ యదార్థ పిపాసువులైనవార య
వ్యయ కరుణావిశేష రుచిరాత్త మనస్కుడనై సుఖింతునో
భయపడనేల నాపలుకు పల్కులు బాష్పకణాభిరామముల్

ఏకవి పిచ్చిగా నడుచు పృథ్వికిలోబడి కీర్తికోసము
ద్రేకము సంహరించుకొని దేశముపోయిన త్రోవబోవునో
ఆకవి పేదమూతి పగ డంబుజగర్భుని రాణిగారికిన్
సాకుడుబిడ్డ డాస్తిగల సామికి బేరసిక ప్రదాతకున్

పుట్టంగావలె సత్కవీశ్వరుడు నీ పుణ్యాన మావంశపుం
బుట్టంజీలిచికొంచు సంచితకళాపూర్ణ ప్రభారాశియై
పుట్టంగూడదు పుట్టినం గలుగవెప్డున్ నిండుసన్మానముల్
గట్టా యుచ్ఛత నీచతాయుత వితర్కభ్రష్టదేశంబునన్

పిడికెండన్నము బెట్టలేదెపుడు మా వేమన్న జీవించి న
ప్పుడు ముద్దుల్ మురిపించు మేలికవనంపుం బుగ్గలుప్పొంగి కా
ఱడవుల్ మొద్దులు మోసులెత్తునపు డౌరా నేడు గోరీపయిన్
నడచుం బూజలు పుణ్యకార్యములు వింతల్ మాదయా ధర్మముల్

బ్రతికియున్న సాయిబాబెన్నడునుగాడు
చావకున్న వట్టి సాయిబయ్య
తిరుమలేశుడైన తెలియడీ యర్థంబు
చావు బ్రతుకులోని సారమిదియ

సమతలు సఖ్యముల్ బెదవిజారినమాటలు కట్టు బాట్లు చ
ట్టములు బటుత్వమూడిన గుటారపు దూముడి బంధనాలు ధ
ర్మములు దయారసాల్ మొసలిరాలుచు నశ్రుకణాలు చిత్రచి
త్రములు మతస్వభావములురామరగా వివరింప గల్గితిన్

ఇప్పుడు గుండురాతివలె నీశ్వరుడై ముడుపుల్ గ్రహించు కో
టప్ప యొకానొకప్పుడు గృహస్థుడు మానవమాత్రులైన రాల్
రప్పలు వేల్పులై సకలరాసులు మ్రింగక మిన్నకుండునే
యప్పపులుంగురాణి యిక నాసలులేవు క్షుధార్తజాతికిన్

మరణము వార్ధకంబను ప్రమాదమెఱుంగని కైతలల్లున
బ్బురపుఁ గవీంద్రు రెడ్డికులముఖ్యుని వేమనచాకచక్యమున్
మరచి పురాణకావ్యరస మత్తుడు వీరుడు సంఘసంస్కృతి
స్థిరుడు రచించె నాంధ్ర కవిజీవితముల్ బొరబాటు చేయుచున్

దొడ్డరాళ్ళగుండ్లు దొరలించి పరితల
బెదురు బెట్టు కవిత విస్తరించి
పండితులకుదక్క పరుల కందకపోయె
దేవతలకు కామధేనువట్లు

కవితచచ్చుదయ్యు గథ పేరుగలదైన
గవికి కొంతకీర్తి గలుగవచ్చు
నెలలు తక్కువైన బలమైనతిండిచే
నుసురునిల్పుకొన్న నిసుగువోలె

వ్యాకరణ శాస్త్రకారులు
క్షాకుఁ గకారంబు విరతి గన్పడదని చీ
కాకుపరతు రంతెకానీ
పాకము రసమింపు సొంపుఁ బరికించెదరే

వ్యవహారంబున భ్రష్టమయ్యు, రసభావస్ఫూర్తి గల్పించి మా
ర్దవముల్ శబ్దములెన్నియో కలుగు శాస్త్రజ్ఞాన మాత్రుల్ పురా
కవితోన్మత్తు లెఱుంగజాలుదురె కుగ్రామీణ భాషాబ్ధిలో
జవులూరించు తెలుంగుపల్కుల జగాస్వారస్యరాహస్యమున్

కనుగొన్నావుగదమ్మ కృష్ణవిభుడక్కాలాన భాషావనం
బునసాగించిన యష్టదిగ్గజరథంబున్ శారదావాహమున్
తెనుగుం దేశము విస్మరించినది తద్దిగ్దంతి దంతావళ
ధ్వనియధ్వాన్నపుటద్రిగర్భముల నిద్రం బోవునాంధ్రత్వమున్

తెల్గు తేజంబెల్ల దిక్కులకెగబ్రాకి
పగవాని బెదరించి వచ్చునపుడు
తెలుగుశిల్పుల సుత్తెదెబ్బ ఖంగునమ్రోసి
చీనాకు పయనంబు సేయునపుడు
తెలుగుకవిత్వంబు దిగ్దంతులముఖాన
బృంహితధ్వనులు గావించునపుడు
తెలుగుజెండాశక్తి నలుదెసల్ ప్రసరించి
విద్యానగరవీధి వెలుగునపుడు

రామలింగని హాస్యకార్యములు దలచి
నాల్గుదిక్కులు కడుపుబ్బ నవ్వునపుడు
నాట్యమాడిన యానంద నవ్యలక్ష్మి
కానుపించెనె శిథిలదుర్గములయందు

అక్కట తల్లికోట సమరాంగన యాఖరు తెల్గుపోటుచే
యుక్కిరి బిక్కిరై తురకయోధులవంకకు వాలునాడు భూ
భుక్కులగండడౌ తెలుగుభోజుని పూజలు చూరగొన్న యా
టక్కరిదేవతల్ తనువు దాచుట నాకు నసహ్యమయ్యెడిన్

తొంబదియేండ్ల వృద్ధుడతి దోర్బల భీముడు రామరాజు డెం
తెం బరగండడౌ నృపమణీ సుతభర్త మహమ్మదీయ ఖ
డ్గంబులకున్ శిరం బొసగి కష్టముదెచ్చినమాట ఆంధ్రవ
ర్గంబు సహింపనేరని పరాభవమై భవమై దహించెడిన్

తెలుగులందను నగరంబు తెలుగుకోట
తెలుగుకవి దిగ్గజంబులు తెలుగుదనము
పొట్టిగుఱ్ఱమునెక్కిన పొగరుబోతు
టళియరామునికతన ముక్కలయిపోయె

విహరింపనే భీతివిడచి మస్తమునెత్తి
సకల సామ్రాణ్మహా సభల లోన
వాక్రుచ్చనే రాలు వగలి బుగ్గలుజిమ్మ
నతి నిశాతప్రబంధాదికములు
కల్పింపనే తెల్గు కల్యాణికొప్పున
సొగసైన కీరితి పొగడదండ
ఎత్తింపనే మేటి హిమవద్గిరులమీద
శాశ్వతవిజయ రాష్ట్రధ్వజంబు

పగరగర్భకుహరి స్వారిగావింపనే
యింటి గుట్టు బయటి కెక్కకున్న
సమ్మతించి జాతి కుమ్మక్కుగానున్న
కొండలన్ని పిండిగొట్టనొక్కొ

అది మారత్నము లారబోసికొను విద్యాశారదాపీఠ మ
ల్లది మాకత్తుల ఖారుఖాన మది యాంధ్రాదిత్యబింబంబు సం
పద సొంపారిన మాల్యవంతమని డంబంబొప్ప చాటించు స
మ్మద సౌఖ్యంబొక తెల్గువీరునకె సంప్రాప్తించెముమ్మాటికిన్

కలవెన్నో విషయంబు లాంధ్రుల కళాకౌశల్యముల్ సాటు తా
వులు ప్రత్యర్థులగుండెలో వెరపు నిప్పుల్ సల్లు గాథావళుల్
కల విప్పన్ బలనాటి పౌరుషపు రేఖల్ మాశరీరంబులన్
కలుపుంగోలుతనంబులేదది కళంకంబంధ్రు మాజాతికిన్

ముసలిమానులలోని యసమ సమత్వంబు
లంగోటిగట్టి చెలంగుచుండ
ఘూర్కా సిపాయీల కుటిలశౌర్యజ్వాల
నట్టింట కావలా నడుపుచుండ
ద్రవిడుల కార్యసాధన ధనార్జనదీక్ష
సాంబారు నోరెత్తి చాటుచుండ
రాష్ట్రాంతరములకు బ్రాకి హిందీ భాష
పదుగురి నోళ్ళలో నెదుగుచుండ

అఖిలదేశములకు నవతంస కుసుమంబు
రాజితోగ్రకదన రక్త తిలక
మానధనికురాలు మా తెల్గుటిల్లాలు
కలత జెందదౌర కాలమహిమ

గౌతమి గంగలోన మృతకాంతులతో నుదయంబుగన్న వి
ఖ్యాత మణీవితానము మహమ్మదురాజుల దండు దెబ్బతో
తాతలనాడ పోయె నిక తాతలుబుట్టిన రావు రత్న దీ
పాతత కాంతులీను గృహ మక్కట నూనెకు దేబెరించెనే

రతనా ల్దాంగలు దోచుకున్నపుడు శౌర్యశ్రీలు విద్రోహి భూ
పతులేటే మృదుక్తి చాతురలచే బంధించునాడేని భా
రత చండీశ్వరి కోటిమస్తముల దర్పంబుంబ్రదర్శింపదో
ధృతిహీనంబగు భిన్న భిన్న మత విద్వేషంబు పాటించెనో

గప్పాల్ గొట్టిన నేమి లాభము ధరా గర్భాన నిద్రించు కృ
ష్ణప్పల్ దాతలు లేచివచ్చెదరె వీరావేశ విభ్రాజితుల్
నిప్పంబోలు తెలుంగువీరు లిపుడున్ జీవించియున్నార లీ
చప్పంబడ్డ యనుంగు సోదరుల కుత్సాహంబు సంధింపగన్

ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వ
విశ్వసత్యము నాలపింప గలదొ
ఏనాడు మాజాతి దృష్టి మాంద్యము వాసి
చుట్టుప్రక్కల దేరి చూడగలదొ
ఏనాడు మా బుద్ధి లీ జుట్టు తలలేని
పుక్కిటి కథలలో జిక్కువడవొ
ఏనాడు మావిద్య లినుపసంఘమునందు
చిలుము పట్టక ప్రకాశింపగలవొ

తనువుదాచక సోమరితనము మాని
యెన్నడీమతంబులు బిచ్చుమెత్తుకొనవొ
అట్టి శుభ వేళకై కొంగుబట్టి నిలచి
నలిగి వాపోవుచున్నది నామనస్సు

ప్రభువుల పెండ్లి పేరంటాలు వర్ణించి
కాలంబు పెక్కేండ్లు ఖర్చు పెట్టి
విరహవేదన మేనుమఱచి మూర్ఛలువోవు
రాణివాసంబును రచ్చకీడ్చి
అంగాంగ వర్ణనా వ్యసనంబు రెట్టింప
యువకజీవితకోటి కుచ్చులాడ్డి
పదియునెన్మిది మార్లు బాడిన శ్రీరాము
చరితంబు వగరెక్క తిరుగుబాడి

శరణు శరణటంచు బరుగులెత్తుచు వచ్చు
నార్తలోక రుత మనాదరించి
భువన హితముగోరు కళాశక్తి
స్వార్థజడధి నూరవైచినారు

పెద్దల శల్యముల్ బలె వివేక మొసంగని గ్రంథరాసులే
విద్దియలైన నింక బది వేల యుగా ల్దలకాయలేని గం
గెద్దులు బుట్టి స్వార్థపరులెత్తిన గంతలుమోపి తీరెడిన్
బుద్ధి చిగుర్చునే యరుచి బుట్టుకథల్ దలమీద రుద్దినన్

ఆడుది లేకయున్న గృతి కందములేదని నమ్మియెన్నడో
పాడి రనుత్తమ ప్రణయ బంధుర గీతము లర్థతృష్ణ వె
న్నాడ కవుల్ మహీపతి బృహన్నల వర్గము సంతసింప నీ
నాడు రచింతు రిద్ధ కరుణా పరిణద్ధ రసప్రబంధముల్

మొన్నటి యుద్ధదేవతకు బుట్టినకూతురు క్షామదేవి మృ
ష్టాన్నముగా భుజించిన క్షుధార్తుల డొక్కలు శల్యరాశి సం
పన్నుల వీధులందు గనుపట్టెనె? వంగకవీంద్రకోటి చే
కొన్న కలాలెరుంగవనుకొందు దయారస నవ్యకావ్యముల్

చలిచీమం బొలియింప నేరని యహింసా మానసుల్ జాలలో
మొలిపించెం బహుబుద్ధ విగ్రహచయంబుం భారతంబంతటన్
కలమైపోయెనొ తత్కృపా గుణము బంగాళంబులో బ్రేమమూ
ర్తులులేరో భుజియింపరో ద్రవిణవంతుల్ మేలి మృష్టాన్నమున్

ఎట్టు నశించి పోయె నితరేతర విశ్వసనంబు లెందు కీ
చట్టములుం బ్రమాణముల సారమషీరస పత్రలేశముల్
కొట్టిన గొట్టుమం చెదరి గుండియలం గరగించు ధర్మముల్
బుట్టినగడ్డలో నకట పూక్కృతి సల్పు నశాంతిసర్పముల్

అనఘం డశ్రు మషీజలంబున వివేకానంద సన్యాసి వ్రా
సిన వ్రాతల్ దడియారలే దిపుడు ప్రాచీనంపుటజ్ఞాన బం
ధన విచ్ఛేదమొనర్చి యే ఘనుడు విద్యాభిక్ష గావించి ప
చ్చని బంగారమువంటి మా భరత సంసారంబు నెగ్గించునో

గాలిందూలెడు శుష్క దేహములతో కాషాయ వస్త్రాలతో
శూలంబుల్ సొరకాయ బుఱ్ఱలు జటాజూటంబులుం దాల్చి యా
మూలాగ్రంబుగ భ్రష్టులై తిరుగు బాబుల్ దొడ్డగంజాయి భా
యీ లున్నా రెదురైనవారె మునిపక్షీ కుక్షిరక్షాపరుల్

జపమో ధ్యానమొ యభ్యసించి యతివేషంబూని క్రీడించి మో
సపు బార్టుల్ ప్రతి పల్లెటూర గలరీ సన్యాస వర్గంబు నీ
కుపదేశింపదొ యిష్టసిద్ధికని మాయోపాయ మంత్రంబు భ
క్తి పరత్వంబొక సాధనం బిహ పర స్త్రీ వంచక శ్రేణికిన్

పాలుం బండులు కందమూలములు మాభక్ష్యాన్నముల్ గోరమే
కాలం బన్యపదార్థముల్ రజితమో బంగారమో కొద్దిగా
జాలున్‌మాకని సేకరించెదరు గోసాయీ లుపాయాలు మో
సా లెన్నేని నిరంతరాయముగ రాజ్యంబేలు నేడెల్లెడన్

వృత్తుల్ సర్వము త్రుప్పుపట్టి చనగా భిక్షాటనంబుల్ జగా
వృత్తుల్ కా పలుజాతు లై నిలువ దుర్భిక్షంబు రాకుండునే
యుత్తుంగాశయు లెందరో కలరు దేశోద్ధారకుల్ పూనరీ
చిత్తంబేర్చు కళంకమున్ దుడిచి సుశ్రీ నేలకుం గూర్పగన్

ఎన్ని సుక్షేత్రములు సార మిగిరిపోయి
ముండ్లతుప్పల బంజర భూములయ్యె
దృఢతరంబైన యెంతెంత దేహశక్తి
భిక్షకుల మేప జీర్ణించ పృథివి గలిసె

పదవుల పీటలెక్కి యనువారము లంచపు బాడిబత్తెలం
బిదికి గడించి కార్మికుల పేదల చెమ్మట దెచ్చి కాన్కలి
చ్చెదరు పరోపజీవులు విచిత్రపు భక్తులు వేషధార్లు నీ
కెదురయి వచ్చిరే వలదిసీ చెయిసాచకుమమ్మ పక్షిణీ

నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు
ధర్మ శీలురున్న ధరణిమీద
కాలుమోపలేక గబ్బిలమొక్కటే
చరణయుగళి దివికి సాచినడుచు

పూజారి బోషాణమును కాపలాకాయు
చిల్లర వేల్పుల సేవజేసి
గొఱ్ఱెపోతుల నల్లజుఱ్ఱి గఱ్ఱున ద్రేచు
కరకు సత్తులకు జాతరలు సల్పి
ఏటేట పెండ్లిజేయించుకొంచుదయించు
కృతకరాముల పల్లకీలు మోసి
నిలువుదోపిడి చేసి తలకాయ గొరిగించు
యేడుగొండలవాని మేడలెక్కి

ఆంబుధీశుని కళ్యాణులని తలంచి
ముంచుగంగమ్మలకు డబ్బు పోసి పోసి
పాతకముపోలె నావెన్ను వాయకున్న
గోచితో నిల్చియున్నాడ పేచకంబ

గుజ్జాలకు టెక్కలుగల
వెజ్జియుగాల్ దాటిపోయె విజ్ఞానంబున్
బుజ్జగల గాంధి యుగమిది
కజ్జలు ఖడ్గంబు లేలగాలేవు ప్రజన్

రాజుగారి గుఱాల రథచక్రముల క్రింద
మరణించు రైతుకు శరణమిచ్చి
నరజాతిలోన నంతరము లుండుటకన్న
నఘములేదను ధర్మమాకళించి
బహుమతాచార దుర్భర పదాహతిచేసి
అసురుసురగువారి కభయమిచ్చి
రాజభాషలకన్న రాష్ట్ర భాషలలోన
రసమున్నదను యదార్థత నెఱింగి

యుగయుగాలనాడ యూబిలోదిగబడ్డ
మహితమైనజాతి మత్త గజము
ప్రబలదాస్య నిగళబంధంబు లగలించి
దెసల మసలుచున్న దినములివ్వి

కలరే మోసపు దేశభక్తి పరులక్కైలాస దేశంబునన్
చలికిం ఖద్దరుధారులై యవల స్వేచ్ఛారాజ్యభాగంబు రా
గలదంచున్ విహరించు పెద్దలు పతంగస్వామినీ నిమ్న జా
తులపై వీరువెలార్చు బాష్పములు చిందున్ దియ్యగా పుల్లగా

ఒకడు రుద్రాక్షమాలికలు నెత్తికి జుట్టి
శివమూర్తియై భూమికవతరించు

ఒకడూర్ధ్వపుండ్రంబు లురువుగా దగిలించి
శివలింగమునుజూచి చీదరించు

ఒకడు రెండునుగాని వికట వేషముదాల్చి
పైవారిమీద సవాలు సేయు

ఒకడు గంజాయిదమ్ముకు దాసుడై పోయి
బూడిదగురవడై పుట్టివచ్చు

మనుజులార మాది ఘనమైన మతమని
ఒకడు తరిమి తరిమి యుగ్గడించు
పెక్కుమతములిట్లు పేచీలుసాగింప
మార్గమేది యైకమత్యమునకు

మొక్కుబళ్ళ నెపాన చక్కని పసిపాప
లెందరు గంగలో నిమిడిరొక్కొ

సహగమనాచార దహనదేవత లెన్ని
చిగురు గొమ్మల బూదిచేసెనొక్కొ

చదువుదాచెడు దురాచరణ మెందరి కళా
భ్యసనచాతురి గొంతు బిసికెనొక్కొ

పొందెరుంగని వేరుబంధాలచే బాహు
బలమెంతగా చచ్చుపడియెనొక్కొ

చిలిపిరాలకు నగిషీలు చెక్కి చెక్కి
కాలమెంత యుగాంతాన గలిపిరొక్కొ
చదువ నేర్చిన వెఱ్ఱిని జంపగలరె
ఒక్కబుద్ధుడు నొకక్రీస్తు ఒక్కగాంధి

శిలవంటి యూరిసత్తులకు నెత్తుటికూడు
రేపులు మాపులు మేపలేక

ఆచారమని తప్పదని వెంటబడివచ్చు
గురులదక్షిణ లిచ్చుకొనగలేక

మంత్ర తంత్రముల సోమరిమాంత్రికుల బారి
బడి ధైర్యమును చిక్కబట్టలేక

శతసహస్ర క్రూర మత సింహములు సేయు
కుటిలగర్జకు తట్టుకొనగలేక

అనుగు తమ్ముల సిరు లోర్చుకొనగలేక
పిచ్చిపూజల మమతలు విడువలేక
అమరనుతమైన మాదు దేశాభ్యుదయము
యుట్టికిని స్వర్గమునకెక్క కూగులాడు

విందుభుజించి పొమ్మనుచు బిల్చుటకర్హతలేదు నాకు క
ర్మంది పతంగినీ పనికిమాలిన సంఘము సమ్మతించునే
పొందులు పొత్తులు న్మనకు ముప్పదిమూర్ల కులాలవారికిన్
నందుల నాగులంగొలిచి నవ్వులపాలగుచున్న జాతికిన్

స్వయముగ నన్నపూర్ణ తనభర్తకు సిద్ధము జేసియున్న య
వ్యయరుచిరాన్నమున్ శివుని పంక్తి భుజించిన పూజ్యురాల వ
న్వయము తరించె నిట్టి మునిపక్షిణివై కులభేద బుద్ధిచే
కయికొనకుందువే సఖుల గర్భదరిద్రుల యాతిధేయముల్

తులవాక్రుచ్చగరాని నెత్తుటిసిరాతో వ్రాయుచున్నారు మ
త్కులజుల్ దుఃఖరసోత్కటంబులగు పెక్కుల్ కావ్యముల్ జాతి లు
బ్ధుల వజ్రస్థిరచిత్తముల్ గరగి సంతోషించునో యీప్సితం
బులు పండింపక సుంకుతోసమసి మామూల్త్రోవలం ద్రొక్కునో

కవిగారికిదె నమస్కారంబనెడువాడు
కళకు లెమ్మని పరోక్షమున బలుకు

కవనంబునకు మేను గరగి మెచ్చినవాడు
కవిచెంత వెఱబెఱికముగ మసలు

విద్యా కళంకంబు వెదకజాలనివాడు
జాతిలేదని నోరుచప్పరించు

శాఖీయులకు సహస్రములు బోసినదాత
అన్యుల మధుర వాక్యముల దనుపు

జీవకళలు చెక్కు శిల్పిని నిరసించి
శిల్పమునకు పూజసేయునట్టి
వక్ర చరితులైన వ్యక్తులు గలచోట
కళల కకట ప్రేతకళల గతులు

పోటీసేయ సమర్థులయ్యెదరె మాముక్కన్న తిక్కన్నతో
మేటుల్ షేకుసుపీయరుల్ బయిరనల్ మిల్టన్లు గోల్డుస్మితుల్
నా టైనారు స్వకీయులైన కవులీనా డన్యభాషాకవుల్
నీటై రక్కట కాలమాంత్రికుని పాండిత్య ప్రభావంబునన్

జాతీయోద్యమ యుద్ధరంగమహితోత్సాహ ప్రతిధ్వానముల్
కూతల్‌బెట్టుచు నాల్గుజాతులకు గగ్గుర్పాటు గల్పించెడిన్
స్వాతంత్ర్యంబను స్వర్గసౌఖ్యమున మా భాగంబు మాకిత్తురో
ఖాతాలేదని త్రోసిపుచ్చెదరొ వక్కాణింపవే చెల్లెలా

కలధౌతాద్రిగుహల్ ప్రతిధ్వను లెసంగన్ దెల్గు రాష్ట్రార్థమై
గలభారేచిరి సోదరాంధ్రజను లాకర్ణింపవో నీవు చె
ల్లెల రాష్ట్రంబు గడించినారనుచు హాళిందేలితో తెల్గు బి
డ్డల యత్నా లనరాదుగాని యవి సోడాబుడ్డి యుద్రేకముల్

బలియైనాడు ధరాహితార్థము మహాభాగుండు యేసుండు త
త్ఫలితంబై కనుపట్టు భిన్నమత సిద్ధాంతంబులుం జీలికల్
కులముల్ గుట్ర లనైకమత్యములు చిక్కుల్ జీదరల్ రిత్త బో
ధలు వేదాలు పదాలురాల్ప వర చేతన్మక్తి ముక్తామణిన్

భోగు లాహారించు భుక్తి కన్నులజూచి
పరమ పేదలు దుఃఖపడని చోటు

సాంఘికాచార పంచాస్యగర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు

జాతివైషమ్య రాక్షస పదాహతిచేసి
కందక కళలు పెంపొందుచోటు

పరిపాలక క్రూరతర కరాసికి లొంగి
పోక స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు

అనదబిడ్డలుజూడ నెయ్యంపుసుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు
చెప్పగదవమ్మ చూచివచ్చితివె నీవు
నిశ్చయంబుగ వాసముండెదను నేను

పయిపై నవ్వులు పల్కరింపులుమృషాబాంధవ్యముల్ సూపి యా
పయి శత్రుత్వము సేయు నాగరికతా భ్రష్టస్వభావాధముల్
సయితానుల్ చరియింపనట్టి ధర గోష్పాదంబు గన్పట్టినన్
దయతో నాకెఱిగింపుమమ్మ యచటన్ నాయిల్లు గట్టించెదన్

కళలం దాచెడు చుప్పనాతితన మింకం దేశమందున్న చో
కలదే ముక్తి ప్రపంచసభ్యతకు మార్గం బుండునే జాతికిన్
తలయుం దోకయులేని తొంబది సమాధానంబులం జెప్పి పే
దలవంచించు కళానిహంతులె యనర్థం బీ శుభక్షోణికిన్

అసుశక్తిం బనిసేయుచున్ మసలు దేహాపూర్వయంత్రంబులో
బిసలెన్నోకల వే నెఱుంగనివి నావిజ్ఞాన భాండారపుం
బిసలెల్లం బనిసేయవిందలిమరల్ పాడైనచో యెవ్వడీ
బిసగాడెందుల కీ రహస్యములకున్ బీగంబు బంధించెనో

అచ్చెరువున్ ఘటింపగల యంత్రములంగనుగొన్న జ్ఞానులుం
జచ్చిరి చావు పుట్టువుల జాడ లెఱుంగ కెటింగి దేవతల్
జచ్చిరి మృత్యువుం గెలుచుశక్తు లొసంగని చుప్పనాతి వే
ల్పెచ్చట డాగినాఁడతని కెందుల కీతెరచాటు మోసముల్

మును మేనూడ్చిన వారియెమ్ములెరువై భూదేవి పండించి నిం
చిన నానా ఫలవృక్షరాజముల కిచ్చెన్ దివ్యమాధుర్యమున్
తను రక్తంబును మేఘమై కురిసి యానందంబు గల్పించు చ
చ్చున దేదీ ప్రతిజీవియుం దిరిగి వచ్చుం భిన్న రూపంబులన్

మరణితులైన వారి తనుమాంసము కొన్నియుగాలు భూమిపై
మురిగిర సాయనప్లుతుల పూర్ణపరీక్షల నిగ్గుదేలి యా
ఖరకు శిశూత్కరాదులకు కాయముగా విలసిల్లకున్న నీ
సురచిర దివ్యకాంతులు నిసుంగులు మేన రహింప నేటికిన్

ఆ జన్మంబు తపంబునం బెరిగి దేవావాస వాస్తవ్యవై
పూజాపద్ధతులెల్ల నేర్చితివి నీ ముత్తాతలుం దాతలున్
జేజమ్మల్ కులసంఘ బాహ్యులయి కష్టింగుందుచో దేవతల్
రాజీపెట్టిరె పేదవారిమొర కర్ణక్లేశ మెవ్వారికిన్

మాతృభాషలకర్థ మర్యాద లొనరించు
సర్వకళాశాల సాగుచోటు

ప్రజలనాహరించు బహుమత దేవతా
దైనందినగ్లాని లేనిచోటు

నవనీతనిభమ్మైన కవుల కమ్మని వాక్కు
వెలివులే కావిర్భవించుచోటు

సంతానమునకు వైషమ్యంబు నేర్పని
తల్లిదండ్రులు విరాజిల్లుచోటు

విసపునవ్వుల లాహిరీ వేషగాంధ్ర
పాదచిహ్నాల మరక లేర్పడనిచోటు
తోడునీడయు లేనట్టి దుర్బలులకు
గబ్బిలపుచాన వాసయోగ్యంబుగాదె

జాతీయపౌరుష జ్వలన మా బాల్యంబు
సవరించు కావ్యరాజములులేక

విక్రమక్రమశిక్ష వెన్నతోనిడు జిజా
సతివంటి మాతృదేవతలు లేక

నొకజుట్టు నొకబొట్టు నొకకట్టుబడి నేర్పి
పాలింపజాలు దేవతలులేక

కులమెల్ల చెదరి తెంపులు తెంపులగుచుండ
వారించి కాపాడు ప్రభువులేక

బుద్బుదంబుల కొనయైన మూడునాళ్ళ
పదవులకు ప్రతిష్ఠలకునై ప్రాకులాడి
నరులనమ్మించుకొనలేక నమ్మలేక
చిదికియున్నవి మాజాతి జీవితములు

అసల్ చెప్పుదురిప్పుడీ గురులు ముందాకాశసింహాసనా
ధ్యాసీనత్వము సంఘటించు నిది సత్యంబంచు యూహింతు రే
బీసీనాటి పురాణగాథలు రుషావేషంబుతగ్గించి నా
దాసత్వంబు స్థిరీకరించెడు పరంధామంబు నాకేటికిన్

పుట్టుకపూర్వమే తలను బుంపినజాతి మతప్రచండ సం
ఘట్టనచేసి నా సహజకౌశలముల్ నశియించిపోయె నీ
కట్టినకట్లు విప్పనధికారములేని గురుండెవండొ యీ
యుట్టికినెక్కలేని నను నూచెడినంట వికుంఠవోలికన్

ననుసృష్టించినవాడె నావెనుక జన్మంబెత్తునే నోరెఱుం
గని నన్నీపదివేల రూపములతో కంగారుగావించునే
కనకంపుం గుడి గోపురాల్తనకు నాకాంక్షించునే కానుకల్
గొనునే యిట్టివి మోసగాండ్రయిన భక్తుల్ పన్ను పన్నాగముల్

అనినమాటను మార్చుకొనలేని శాస్త్రముల్
స్వాభిమానముదక్కి పలుకగలవె?
కులముంచుకొని నన్ను గొలుచుకొండను వేల్పు
కడగి నాకన్నీరు దుడవగలడె?
మానవదాస్యంబు మరగిన లోకంబు
నెనరూని నా చెల్మి నెఱపగలదె?
అస్వభావిక కథావ్యాసంగ హతమైన
పృథివి సత్యంబు నూహింపగలదె?

యుడుకురక్త మెన్నడో చచ్చుబడిపోయి
చేతులెత్తి మ్రొక్కు స్వీయజాతి
కఱకు వీరసూక్తు లరిగించుకొని వేచి
యెదుటనిలచి పగర నదమగలదె

ధర్మసంస్థాప నార్థంబు ధరణిమీద
నవతరించెద ననె నబ్జభవునితండ్రి
మునుపు జన్మించి నెత్తి కెత్తి నదిలేదు
నేడు జన్మింపకున్న మున్గినది లేదు

కనుబడలేదు దైవతముగాని పదార్థము భారతంబునన్
గనుపడలేదు వర్ణమునకన్న పిశాచము భారతంబునన్
కనుపడలేదు సత్కులముకన్న మహాకళ భారతంబునన్
గనుపడలేదు పంచమునికన్నను నీచపుజంతు వేదియున్

హక్కుల్ దొంగలుదోచుకున్నను మనుష్యత్వంబుజంతుత్వమై
చిక్కుల్‌వెట్టెడు కాలమందును క్షమాసిద్ధాంతముల్ నేర్వ నా
పక్కాపౌరుషవహ్ని నార్పు మత రూపక్రూర సింహంబు నా
ప్రక్కం బండులునూరుచున్నది తలంపన్ శల్యసారథ్యమై

జగముల్‌మెచ్చు బియే లెమేలు బిరుదుల్ సాధించినామంచు నీ
లుగు మామాలలు మాదిగల్ గులమహాలోభంబు రెట్టింపగన్
తెగలంగట్టి తగాద లెంచెదరు గానీ సంధి గావింపరో
ఖగభామా మతబోధలేల కులకక్ష్యాభ్రష్ట దుర్జాతికిన్

అసలే ముక్కిడి దానిమీద పడిసెంబన్నట్లు మాజాతి బా
నిసలౌరా కలహించుచుండు రుభయుల్ నీచోచ్చతా నిర్ణయ
వ్యసన వ్యగ్రత సిగ్గుచేటగు నయో యస్పృశ్యతా త్రాసమం
త్రసమేతుండగు గాంధి నేరడివి యంతర్నాటకారాటముల్

భీతింగొల్పెడు నస్వభావిక కథావేదాంత శాస్త్రాలకుం
జేతుల్ మోడ్చు నమాయకప్రజలు సంసేవింప భోగాబ్ధిలో
నీతల్‌గొట్టు కవిప్రకాండముల సాహిత్యప్రపంచంబులో
ప్రాతః కాంతుల జిమ్మునట్టి కవితాభానుండు జన్మించునే

నటకుని వోలి కాలపరిణామవిధేయములై రహించు ను
త్కట మత ధర్మశాసన నికాయముతీరుపు చేసి సంఘ సం
కటముల పాలొనర్చి యధికారముసేయు దరిద్రజాతిపై
కటకట నల్వురాడు నెడ కల్ల యథార్థము గాకపోవునే

రచ్చలకెక్కనీక సమరంబున బూడ్చిన కర్ణశక్తి నే
డెచ్చట జూచినం బ్రభవహించి సముజ్జ్వలమై వెలుంగదే
కచ్చ లసూయలుం గళ నొకానొక కాలము డాచియుంచినన్
హెచ్చి తురంగలించి ధ్వజ మెత్తకపోదు యుగాంతరంబునన్

కవ్వడి పరువున్నిల్పగ
న వ్వసుదేవాత్మజాతు డట్లనెగానీ
కవ్వడి కర్ణుని గెల్చుట
నవ్వులపాటనెడుమాట నల్వు రెఱుఁగరే

వలదన్నన్ వెనువెంటనంటి నను నిర్బంధించుచున్నట్టి వే
ల్పుల సిద్ధాంతములెల్ల నాసహజ సంపూర్ణ ప్రతాపంబులో
జిలికెం జిక్కని చచ్చుమందు మునిపక్షీ యింక నీవంటి గ
బ్బిలముల్ సేయు హితోపదేశముల వే వేల్గాలికాహారముల్

అగుపించెనే యసూయా దుర్గుణజ్వాల
సంహరించెడు శాస్త్రసముదయంబు
పరికించివచ్చితే పరమతసహనంబు
భాషించు వేదాంత పాఠశాల
వీక్షించితే వర్ణభేదాల వ్యాధిచే
శాంతిగా రాజ్యంబు సలుపు నెలవు
కనుగొంటివే మనుష్యునిజూచి మనుజుండు
మిట్టిమీనై దాటునట్టిసీమ

నేను చిందులాడి నేను దప్పులుగొట్టి
యలసి సొలసి సత్తికొలుపు గొలువ
ఫలితమెల్ల నొరులు భాగించుకొనిపోవు
నీచమైనభూమి జూచినావె

క్రూరల్‌కుత్సితు లస్మదీయములు హక్కుల్ దోచుకొన్నారు న
న్నూరింబయటంబె నెట్టినా రిపుడు నన్నోదార్చుచున్నారు గాం
ధారేయల్ నెలకొల్పినారు బహుసంస్థల్ లక్కయిండ్ల క్కటా
మారుందమ్ములు నమ్మజాలనివి స్వాత్మశ్రీ సమారంభముల్

తనురక్తంబు వ్యయించి సత్కవికళాద్రవ్యంబు వెచ్చించి మ
ల్చిన శిల్పాలు విమర్శక బ్రువుల కల్తీ వ్రాతలం ఖ్యాతికె
క్కనివైపోయె నసూయచేబలుకు నాల్కల్ సత్యమున్ జాటునే
అనుమానింతురు కొంద రీశ్వరుని ధర్మాధర్మ నిర్ణేతృతన్

జనులం బీలిచి పిప్పి జేసెడు దురాచారంబులన్ గాల మ
ట్టని విద్యాబలమేల విద్యయన మౌఢ్యవ్యాఘ్రికింపైన భో
జనమా మోసపు వ్రాతకోతలకు రక్షాబంధమా యెందుకీ
మనుజత్వంబు నొసంగలేని చదువుల్ మైరేయపుం మైకముల్

చిరకాలంబును భిన్న జాతి మతముల్ జీవించు రాజ్యాన సు
స్థిరమై శాంతి రహించునన్న నుడి సందేహించెదం బక్షిణో
తురకల్ హైందవు లీ స్వరాజ్యరథమున్ దొర్లింతురే దక్షిణో
త్తరదిగ్దంతులు రెండునుంగలిసి మేతల్ మేయు తావున్నదే

వీర వసంతరాయడను వేల్పొక డుద్భవమంది దుష్ట సం
హార మొనర్చి ధర్మము సహస్రముఖంబుల నాటునంచు నా
జారిన గుండెలో వెఱపు సల్లుదు రీయనృత ప్రచారకుల్
కారణమమ్మ పిచ్చితలకాయలకున్ వెడ నమ్మకాలకున్

పుట్టించెం దయలేని లోకమున నే పుణ్యాత్ముడో కుక్షిలో
ముట్టించెం బొగలేని యాకటిసొదన్ ముప్పూట లీచిక్కులో
నట్టిట్టై తపియించు నా కొదవు నాహారంబు భక్షింపగా
పుట్టంజొచ్చిరి దేవతల్ బహుళరూపుల్ బుట్టలై చెట్టులై

అట్టు లెడంద నేర్చెడు మహావ్యధ నాతడు వెళ్ళగ్రక్కినన్
బిట్టుకదుష్ణబాష్పములు నిండిన కన్నుల సానుభూతి చూ
పెట్టి ప్రదక్షిణించి సురభిక్షకు నింటికి లేచిపోయె గ
న్పట్టె స్వతంత్రభారత విభాకర బాలుడు తూర్పు డోలికన్

ముని పక్షి రాకపోకల
ఘన సందేశముల కతన ఖర్చయిపోయెన్
దనురక్త మా దరిద్రుఁడు
చనిపోవునొ తత్ఫలంబు జవిజూచెడినో!

# జాషువ రచనలు

జననం: 28 సెప్టెంబర్ 1895 - మరణం: 24 జూలై 1971

| | | |
|---|---|---|
| రుక్మిణీ కల్యాణం | 1919 | |
| చిదానంద ప్రభాతం | 1922 | |
| కుశలవోపాఖ్యానం | 1922 | |
| కోకిల | 1924 | |
| ధ్రువ విజయం | 1925 | |
| కృష్ణానది | 1925 | మే |
| సంసారసాగరం | 1925 | అక్టోబర్ |
| శివాజి ప్రబంధం | 1926 | |
| వీరాబాయి | 1926 | |
| కృష్ణదేవరాయలు | 1926 | మార్చి |
| వేమనయోగీంద్రుడు | 1926 | జూన్ |
| భరతమాత | 1926 | |
| భారతవీరుడు | 1927 | జనవరి |
| సూర్యోదయం | 1927 | ఏప్రిల్ |
| చంద్రోదయం | 1927 | జూన్ |
| భారతవీరుడు | 1927 | అక్టోబరు |
| గిజిగాడు | 1927 | డిసెంబర్ |
| భారతమాత | 1928 | ఫిబ్రవరి |
| రత్నచ్యుతి | 1928 | జూలై |
| ఆంధ్రుడను | 1928 | డిసెంబరు |
| తుమ్మెద పెండ్లికొడుకు | 1928 | ఉగాది |
| సఖి | 1929 | జులై |
| బుద్ధుడు | 1929 | ఆగష్టు |
| తెలుగుతల్లి | 1929 | సెప్టెంబర్ |

| | |
|---|---|
| శిశువు | 1929 అక్టోబర్ |
| బాష్ప సందేశము | 1929 నవంబర్ |
| దీర్ఘ నిశ్వాసము | 1930 ఫెబ్రవరి |
| ప్రబోధం | 1930 మే |
| శిల్పి | 1930 సెప్టెంబర్ |
| హెచ్చరిక | 1930 ఆగష్టు |
| సాలీడు | 1930 ఆగష్టు |
| మాతృప్రేమ | 1930 |
| భీష్ముడు | 1931 జనవరి |
| యుగంధరమంత్రి | 1931 డిసెంబర్ |
| సమదృష్టి | 1931 |
| నెలబాలుడు | 1931 మార్చి |
| నెమలినెలత | 1931 ఏప్రిల్ |
| లోకబాంధవుడు | 1931 జూన్ |
| అనసూయ | 1931 ఆగష్టు |
| శల్య సారథ్యము | 1931 సెప్టెంబర్ |
| సందేహడోల | 1931 ఉగాది |
| స్వప్నకథ | 1932 |
| అనాథ | 1932 |
| ఫిరదౌసి | 1932 |
| ముంటాజమహలు | 1932 |
| సింధూరము | 1932 జనవరి |
| బుద్ధమహిమ | 1932 మార్చి |
| క్రీస్తు | 1932 జూలై |
| గుంటూరుసీమ | 1932 సెప్టెంబర్ |
| వివేకానంద | 1932 నవంబర్ |
| చీట్లపేక | 1932 ఉగాది |
| జేబున్నీసా | 1932 మే |
| పశ్చాత్తాపం | 1932 డిసెంబర్ |
| అయోమయము | 1933 జూన్ |

| | |
|---|---|
| అఖండ గౌతమి | 1933 ఉగాది |
| ఆశ్వాసం | 1933 ఏప్రిల్ |
| మేఘుడు | 1933 ఆగష్టు |
| శ్మశానవాటి | 1933 డిసెంబర్ |
| ఆంధ్రభోజుడు | 1934 మార్చి |
| గబ్బిలం | 1941 |
| కాందిశీకుడు | 1945 |
| తెరచాటు | 1946 |
| చిన్నా నాయకుడు | 1948 |
| బాపూజీ | 1948 |
| నేతాజీ | 1948 |
| స్వయంవరం | 1950 |
| రాష్ట్రపూజ | 1963 |
| కొత్తలోకం | 1957 |
| క్రీస్తు చరిత్ర | 1958 |
| ముసాఫరులు | 1963 |
| నాగార్జునసాగరం | 1966 |
| నా కథ | 1966 |

## జాషువ కవికి లభించిన బిరుదులు - సన్మానాలు

| | |
|---|---|
| కవితా విశారద | 1933 |
| కవి కోకిల | 1936 |
| కవి దిగ్గజ-నవయుగ కవిచక్రవర్తి | 1947 |
| మధుర శ్రీనాథ | 1952 |
| విశ్వకవి సమ్రాట్ | 1964 |
| కళాప్రపూర్ణ | 1970 |
| పద్మభూషణ్ | 1970 |
| ఆం.ప్ర.శాసనమండలి సభ్యత్వం | 1964 |

(జాషువా సాహితీ ప్రస్థానం నుండి)